# తప్పక చూడండి!




యస్.వి.యస్.ఫిలిమ్స్

# నిండుమనసులు

నిర్మాత, యం.జగన్నాథరావు దర్శకత్వం, యస్.డి.లాల్

ఆంధ్ర:జ్యోతిపిక్చర్స్. నైజాం: ఉషాఫిలిమ్స్ , సీడెడ్:నవభారత ఫిలిమ్స్ . మైసూర్:శివశంకర ఫిలిమ్స్

JOTHEE

# ఉత్తరాలు

### క థ లు

30—6—67 వారం పత్రికలోని భీసెట్టి లక్ష్మణరావ్‌గారి 'సంకల్ప వికల్పాలు' కథ చాలా బాగుంది. నేటి సమాజంలో కట్నాలు, కానుకల విషయంగా ఆడపిల్లల తండ్రులుపడే బాధలను పెద్దల మూర్ఖత్వాన్ని సహజంగా చిత్రీకరించారు రచయిత. ఈ కథ చదివిన తరువాతనైనా లాంచ నాలకోసం వంతంపట్టే 'కొత్త పెండ్లికొడుకులకు కనువిప్పు కలుగగలదేమో! ఇంత చక్కని కథను రచించిన రచయితకు నా అభినందనలు.

—ఎన్. పద్మ (అంగలూరు.)

*        *        *

"సంకల్ప వికల్పాలు చాలా బాగుంది. సామాన్య మధ్య తరగతి కుటుంబాలలో జరిగే పెళ్ళిళ్ళలో ఉండే అవక తవకలను చక్కగా చిత్రించిన భీసెట్టి లక్ష్మణరావ్‌గారికి నా హృదయ పూర్వక అభినందనలు.

ఎమ్. వెంకట్రామయ్య (విజయవాడ)

*        *        *

23—6—67 సంచికలో మీరు ప్రచురించిన 'రచయిత్రి జీవితం' చాలా బాగుంది. సిరిజ లాంటి ఆడవాళ్ళు ఉన్నారంటే ఆశ్చర్య పడనక్కరలేదు. శేఖర్ పాత్రను చక్కగా చిత్రించారు రచయిత్రి. గొల్లపూడి రాజ్యలక్ష్మిగారికి నా హృదయపూర్వక అభినందనములు.

సీరియల్స్ రెండు మట్టి బొమ్మలు, పూర్వా సంధ్యా ప్రవర్తతే చాలా బాగున్నాయి. తేజోవతి గారు విద్యార్థుల మనస్తత్వాలను బాగా చిత్రిస్తున్నారు. ఇంత మంచి సీరియల్స్ ప్రచురిస్తున్న మీకు హృదయ పూర్వక అభినందనములు.

మిస్. ఎస్. సరోజ (రాజమండ్రి)

*        *        *

23.6.67 ఆంధ్రసచిత్రవారపత్రిక చూడటానికి ముచ్చటగా యుండినది. ఈ సంచికలో రచయిత్రి జీవితం కథ చాలబాగుంది. గొల్లపూడి రాజ్యలక్ష్మి గారికి నా హృదయపూర్వక అభినందనములు. "పూర్వాసంధ్యా ప్రవర్తతే" చాల బాగుంటున్నది. తేజోవతి గారికి నా హృదయపూర్వక అభినందనములు. ఈ సీరియల్‌లో వేణుపాత్ర నాకు చాల బాగా నచ్చింది.

జి. వి. ఎస్. శాస్త్రి, (విశాఖపట్నం.)

*        *        *

23.6 67న వెలువడిన ఆంధ్రపత్రికలోని, కథ 'రచయిత్రి జీవితం' గొల్లపూడి రాజ్యలక్ష్మిగారు చాలా చక్కగా మరియు వాస్తవానికి దగ్గరగావర్ణించినారు.

రచయిత్రిగావుండి, భర్త సేవజేందుకోలేని, భార్య పెండ్లి చేసుకొనడము అనవసరం.

రచియించిన గొల్లపూడి రాజ్యలక్ష్మిగారికి మా ధన్యవాదములు.

గొల్లపూడి దేవానంద్, పి. ముఖర్జి (పూనా)

*        *        *

ద్విభాష్యం సూరీడు గారి మంచివాడు కథ చాలా బాగుంది. మంచి నీతితో, నేటి సంఘంలో గల ఒక లోపాన్ని ఎత్తి చూపుతూ వ్రాసిన ఈ కథ లాంటి కథలే ఎక్కువగా ప్రచురిస్తే, అవి చదవటానికి సరదాయే కాకుండా, జీవితాన్ని బాగుపరచుకోవటానికి కూడ సహాయపడతాయి. ఇహపోతే, మీరు ప్రచురిస్తున్న కార్టూన్లండీ, అబ్బ, బ్రహ్మాండంగా నవ్విస్తున్నాయి.

వీరబ్రహ్మం అల్లి (బాపట్ల)

*        *        *

"వెలుగుతున్న హారతిలో ఏదో సందేశం!...., తను హరించుకుపోతూ, తను శూన్యమైపోయే వరకూ మానవాళికి ఏదో శాంతిని, ధైర్యాన్ని ప్రభోదాన్ని, భక్తి భావాన్ని ఇవ్వాలనే తాపత్రయంతో భగభగలాడిపోతోంది...... "నేనూ మనం" కథలో చాలా చక్కగా వ్రాశారు. శ్రీ అరిగె రామారావుగారు. వారికి మా ధన్యవాదాలు.

అల్లచెర్వు అన్నపూర్ణ, ఎ. వి. రంగయ్య (గుంతకల్లు)

*        *        *

30.6.67న సంచిక రాగానే అనుకోకుండ వుత్తరాల శీర్షిక చూడడం తటస్థించింది. శ్రీ బి చౌధురి (న్యూఢిల్లీ) గారు వ్రాసినది అక్షరాలా నిజమే మరి. న్యూఢిల్లీ ఆంధ్రులు, (అందురూ కాదనుమా!) ఆడవారైనాసరే, తెలుగు సినిమాకు రావ

ఏమిటి? అక్కడకూడా ఇంగ్లీషులో, హిందీలో మాట్లాడు కోవటమేమిటి? అంటేవారికి ఆ కొద్ది సేపుకూడా తెలుగులో మాట్లాడేందుకు బుద్ధిపుట్ట దేమో! ఆంధ్రదేశం వదిలి కొన్ని వందలమైళ్ళు దూరంలో వుంటూ తమ భాషను తనుగౌరవించలేక పోతున్నారంటే, విచారకరమైన విషయమే. అందుకే పెద్దలన్నారుగాబోలు ''ఆంధ్రులు—ఆరంభ శూరత్వాలు '' అని.

మద్రాసువాళ్ళు, కేరళ వాళ్ళు (ఆడవారైనా) దక్షిణాదులు కన్పిస్తే తమిళంలో మాట్లాడిస్తారు. అదే ఆంధ్రులు అయితేఅంతవరకు తెలుగులో మాట్లాడుతున్నా మూడవ మనిషి రాగానే హిందీలో మాట్లాడడం మొదలు పెట్టారు. అంటే తాము 'ఆంధ్రుల' మని ఇతరులకు తెలిసి పోతుందని భయమేమో మరి! అన్ని భాషల వారు వారివారి భాషను వేరే స్థలాల్లో అభివృద్ధి చేస్తుంటే, ఆంధ్రులు అందుకు విరుద్ధంగా ఇరుగు పొరుగు రాష్ట్రాలలో ఆంధ్రులే తెరపెట్టు చేస్తున్నాగనిపిస్తోంది.

సి. సూర్యప్రకాశ్ (న్యూఢిల్లీ)

## సీరియల్

''మట్టి బొమ్మలు' సీరియల్ 23—6—67 సంచికలో వూహించని మలుపు తిరిగింది. నవలలోని పాత్రలన్నీ నేటి సమాజానికి ప్రతిరూపాలు. మధు, శారద, ప్రసాద్ పాత్రలు సజీవంగా చిత్రించబడ్డాయి. వీటిలో మధు నాకు నచ్చిన పాత్ర.

# ఉత్తరాలు

మలుపుకుముందు, ఆ తర్వాత మధు పాత్రలకిగల వైవిధ్యాన్ని బహు నేర్పుగా ప్రదర్శించారు. రచయిత. అలాగే శారద పాత్ర గూడ. నవలల్లో పాత్రకు పాత్రకుమధ్యగల భావాలు చిత్రీకరించిన పద్ధతి ప్రశంశనీయంగావుంది. రామలక్ష్మిగారి ''ప్రశ్నావళి'' ప్రతివారంవేస్తే బాగుంటుంది

జి. సుబ్రహ్మణ్యం (హైదరాబాద్)

*     *     *

ఈవారం (30—6—67) ''పూర్వాసంధ్యా ప్రవర్తతే , ''మట్టిబొమ్మలు సీరియల్స్ చాలా బాగున్నాయి. మరియు ''సంకల్ప—వికల్పాలు , ''శిక్ష'', ''నేను—మనం'' కథలు గూడా చాలా బాగున్నాయి.

ముఖ్యంగా ''సంకల్ప — వికల్పాలు'' కథలో మొదట్లో వరదరాజ తల్లి— తండ్రిలాంటివారు వుంటారా ? అని అనిపించింది. ఏమైనా కథ చాలా బాగుంది. రచయితకి నాహార్థ కాభినందనములు.

ఇక, ''అధ్యక్షుని మరణం'' వనితాలోకం లోని ప్రేమ వివాహాలు.... మొదలయిన వ్యాసాలు చాలా బాగున్నాయి.

ఏది ఏమైనా ఈ వారం పత్రిక చాలా బాగున్నది.

మాదిరాజు రమేష్‌చంద్ర (హైదరాబాదు—3)

## వ్యాసాలు

మీరు ప్రచురిస్తున్న 'ధర్మపథం' ద్వారా బులుసు వెంకట రమణయ్యగారు చక్కని నీతి దాయక విషయాలు తెలియ పరుస్తున్నారు. కొన్ని కథలను చెప్పుతూ దానిలో గల నీతిని గూర్చి వివరించుచు సులభశైలిలో అర్థమయ్యేల తను వివరించిన శ్లోకాలకు తాత్పర్యము చెప్పు తున్నారు. శ్రీ. రామలక్ష్మిగారు పాటకుల ప్రశ్నలకు సమాధానము చాలా ఉత్సాహముగా నిచ్చు చున్నారు. ఈ శీర్షిక ప్రతివారమున్న యెడల చాలా బాగుండును.

నందిగామ కాశయ్య ఎం.ఆర్.గూడ (హుజూర్‌నగర్.)

*     *     *

23—6—67 తేదీ సంచిక లోని ఉత్తరాల శీర్షిక చూచాను. అందులో ఎస్. ఎస్. ఎల్. సి. ఇంగ్లీషు పేపరులో యీ మధ్య 'ఏనొటేషన్స్' వుండటం లేదు. నిజమే. కాని యించు మించు వో దశాబ్దం క్రితం వరకూ ఇంగ్లీషులో కూడా 'రెఫరెన్సు టు ది కాంటెక్స్ట్' వుండేవి. ఇప్పటికీ తెలుగులో 'సందర్భము (ఏనొటేషన్సు) వుంటున్నది. 2—6—67 సంచికలో 'ఇంగ్లీషులో' అని నేను వ్రాయలేదు. పాఠకులు దయచేసి గమనించ గలరని ఆశిస్తున్నాను.

అభరాపురపు తేజోవతి (గుంటూరు)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 4—8—'67
ప్లవంగనామ సం॥ ఆషాఢమాసం బ॥ త్రయో॥

సంపుటము : 59 సంచిక : 47

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |

## విషయానుక్రమణిక





శ్రీకృష్ణ

# అస్తవ్యస్తంగా తయారైన ఇండియా విదేశ విధానం

కొన్ని వారాలపాటు ఆంధ్రపత్రిక వార పత్రికలో న్యూఢిల్లీలేఖ ప్రచురణ ఆకస్మికంగా ఆగిపోయినందుకు మొట్టమొదట అభిమాన పాఠకులకు క్షమాపణ చెప్పుకొని ప్రారంభించాల్సి ఉంది. మే 21వ తేదీ ఆదివారం నాడు ప్రమాదవశాత్తు మీ విలేఖరి కాలు విరిగింది. జూలై 17వ ఆస్పత్రి నుంచి విడుదలై యింకా మంచంలో ఉన్నా కర్తవ్యం మనస్సుని ప్రోత్సహించడం వల్ల నేను నా విధి నిర్వహణకు పూనుకొంటున్నాను.

ఈ మధ్య అతిముఖ్యమైన సంఘటలున జరుగుతున్నాయి. అరబ్ దేశాలకీ తన ఉనికి కోసం పోరాడుతున్న వో చిన్న దేశానికీ మధ్య యుద్ధం జరుగుతున్నది. అరబ్‌లు సాధించిందేమీ లేదు. ప్రపంచ పటం నుంచి ఇస్రేల్‌ని తుడిచి పారెయ్యాలనుకున్న వారు పరాజితులైనారు. అరబ్బులకు ఐక్యత, సంఖ్యా బలం, ఆయుధ సామగ్రులకి కొదవలేదు. కావల్సిందల్లా ధైర్యం, శిక్షణ, ఆధునిక యుద్ధ పరికరాల ఉపయోగానికి అవసరమైన తెలివితేటలు. మొదటి యుద్ధంలోనే వేల కొలదీ అరబ్ సైనికులు ప్రాణాలకు వెరచి వెనుదిరిగి చూడకుండా పలాయనం చిత్తగించారు. ఆత్మస్తుతికి సుకర్నో అనుయాయుడైన కల్నల్ నాజర్‌కి యుద్ధ పరికరాలు ఉపయోగించడం తెలిసిన, సుశిక్షితమైన ఇస్రేల్ చేతిలో చావు దెబ్బ తగిలింది. అతనొక తెలివైన యుక్తి పన్నాడు. గొర్రెదాటు పద్ధతిలో ఉన్న జాతి తనని పదవిని కొనసాగించాలని కోరుతుందని స్పష్టంగా తెలిసిన కల్నల్ నాజర్ రాజీనామా యిచ్చారు. ఆ వార్తను విన్న ఆయన ఆప్తమిత్రుడు రాజాదినేష్‌సింగ్ హైందవ వృద్ధ వితంతువులా గుండెలు బాదుకుని రోదించారు. కల్నల్ నాజర్ తన ఉద్దేశానికి వ్యతిరేకంగా రాజీనామాను ఉపసంహరింప చేసుకోవాలని పట్టుపట్టి అంగీకరింప జేశారు. ఈ సంతోష వార్తని విన్న శ్రీమతి గాంధీ ఎగిరి గంతేసినంత పని చేశారు. ఒక వ్యక్తి యింత మందిని వివేకహీనుల్ని చేయడం యింతకు ముందెప్పుడూ జరుగలేదు.

ఇండియా విదేశ విధానం యిలా తయారయింది. ఇండియా గెజెట్ ప్రచురణ ననుసరించి భారత విదేశాంగమంత్రి శ్రీ చాగ్లా అయినప్పటికీ వాస్తవంగా విదేశ వ్యవహారాల మంత్రి రాజా సాహెబ్ దినేష్‌సింగ్. శ్రీమతి గాంధీ సూచనలను అనుసరించి తు. చ. తప్పకుండా తమ నాలుకకి తీవ్రంగా పని కల్పించినంతకాలం, తమ జీతం సక్రమంగా అందుతున్నంత వరకూ ఆయన దేన్నీ అవమానంగా భావించరు. ప్రస్తుతం కెయిరోలో నిష్ప్రయోజనకరమైన పర్యటనలో (దినేష్‌సింగ్ వెంట) ఉన్నారు. తర్వాత బల్గేరియా, జూరిచ్, ఫ్రాంక్‌ఫర్టులకి వెళ్తారు.

విక్టోరియా మహారాణికి పాల్మెర్స్టన్ అనే విదేశ వ్యవహారాల కార్యదర్శి ఒకాయన ఉండేవాడు. ఫలానా ఉత్తరాన్ని యూరప్‌లోని ఫలానారాజుకి రాశావా అని రాణీగారాయన్ని ప్రశ్నించారు. ఆయన అవునన్నాడు.

'ఈ అధిపతి బ్రిటన్‌కి ఆప్త మిత్రుడన్న సంగతి తెలీదా?' అనడిగారు రాణి.

'బ్రిటన్‌కి స్నేహితులు లేరు. ఇంకా చెప్పాలంటే శత్రువులుకూడా లేరు. ఉన్నదల్లా ఆసక్తిపరులు మాత్రమే' అన్నాడు పాల్మెర్స్టన్.

దేశ వ్యవహారాల దక్షత, దౌత్యసంబంధాల సారాంశం యిది. కల్నల్ నాజర్‌ని అనుసరించి తత్ఫలితంగా పాశ్చాత్యులకి ముఖ్యంగా అమెరికాకి వ్యతిరేకం కావటమేనా ఇండియా ఆసక్తి అన్నదే యిక్కడ ప్రశ్న. ఇదేనా తటస్థ విధానం? నెహ్రూగారి తటస్థవిధానంలో రష్యా తప్పుచేయదు. పాశ్చాత్య దేశాలు ఏదిచేసినా అది తప్పే? లేక యిది శ్రీమతి గాంధీగారి తటస్థ విధానమా? ఇందులో అరబ్‌లు సరైన వారు, ఇండియా కమ్యూనిస్టుల పితృభూమి అనదగిన రష్యా నాజర్‌ని బలపరచడంలో జాప్యం చేస్తే అదికూడా తప్పే?

శ్రీమతి గాంధీగారి దయవల్ల ప్రపంచంలో భారతదేశం అవకతవకలు ప్రదర్శితమవుతున్నాయి. ఇక శ్రీమతి గాంధీ ఆప్తమిత్రుడైన నాజర్ పుణ్యమా అని ఇండియాకి ఆహారాన్ని తీసుకొస్తున్న నౌకలు నెలల తరబడి ఆలస్యం అయి బీహార్, యు. పి. లలో లక్షలాది మందికి ప్రాణహాని సంభవించింది. రష్యన్లు, వారి కిరోసిన్‌కి ఎక్కువ ధర అడిగారు. కేవు ఖర్చులు పెరగడం వల్ల ఇండియా దిగుమతుల ధరలు పెరిగిపోయాయి. ఇండియా ఎగుమతుల ధరలు అధికం అయినయి. అన్నీ తెలిసినప్పటికీ శ్రీ బాబూ జగ్ జీవన్ రాం సూయజ్ కాలువ ముట్టడివిషయంలో కల్నల్ నాజర్‌ని నిందించరాదని పార్లమెంట్‌లో అన్నారు.

ఏది ఎలా ఉన్నా యీ పరిస్థితిమాత్రం శ్రీమతి గాంధీగారికి బాధాకరంగా లేదు. కమ్యూనిస్టు పత్రికలు తప్ప దాదాపు మిగిలిన భారతీయ పత్రికలన్నీ శ్రీమతి గాంధీగారి అరబ్ పక్షపాత విధానాన్ని దుయ్యబడ్తూనే ఉన్నాయి. కమ్యూనిస్టులు మినహా పార్లమెంట్‌లోని ప్రతిపక్షాలు, అనేకమంది కాంగ్రెస్ సభ్యులు ఆమె విధానాన్ని వ్యతిరేకించారు. 'ఏనుగు వెళ్తుంటే కుక్కలు మొరుగుతూనే ఉంటాయి' అంటారు శ్రీమతి గాంధీ. ఆమెని ప్రధానిని చేయడం ద్వారా శ్రీ కామరాజ్ దేశానికి చేసిన ఉపకారం యిదే. విదేశాల్లో స్నేహితులుకరువై, దేశంలో ఆర్థిక అస్తవ్యస్థతలతో, రాజకీయమైన అవకతవకలతో శ్రీమతి గాంధీ

గారి ఇండియా శీఘ్రగతిన పురోగమిస్తున్నది. ఏవైపుకి వెళ్తున్నదీ దేవుడికే తెలుసు. తమ బిడ్డల భవిష్యత్తేమవుతుందోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు.

* * *

మహారాజాలకు ఏటేటా యిచ్చే భరణం మరోవైపు సమస్య అయిందన్న విషయం అందరికీ బాగా తెలిసిందే. 1947 అగస్టు 15 వ తేదీన రాజ్యాలమధ్య కుదుర్చు కొన్న అంగీకారం వలన 'హౌస్ ఆఫ్ విండ్ సర్'కి బాధ్యులైన ఇండియాలోని మహా రాజాలకు బ్రిటిష్ ప్రభుత్వం విముక్తిని ప్రసాదించింది. వారు తమ తమ యిష్టాను సారంగా భారతదేశంలోనో పాకిస్తాన్‌లోనో చేరవచ్చు లేదా స్వతంత్రంగా ఉండిపోవచ్చు సర్దార్ వల్లభాయ్ పటేల్ చాకచక్యంవల్ల వారు భారతదేశంలో చేరిపోవడానికి నిశ్చ యించుకొన్నారు. పూర్వపు పరిపాలకులను సంవత్సరానికి యింత మొత్తం యిచ్చేటట్లు భారతదేశం పరస్పర అంగీకారంతో ఒప్పందం చేసుకుంది ఆదాయపు పన్ను లేకుండా ఆ మొత్తాన్నివ్వడానికి, కొన్ని సదుపాయాలను కలిగించడానికి భారతదేశం అనుమతించింది. సర్దార్ పటేల్ ఆ అంగీ కారాలని రాజ్యాంగ నిర్ణయసభలో ఆమో దింపజేశారు. అవి భారత రాజ్యాంగంలో చేర్చబడ్డాయి. 1948 మార్చి 5 వ తేదీన రాజ్యాంగ నిర్ణయసభలో మాట్లాడ్తూ పండిత జవహర్‌లాల్ నెహ్రూ యిలా అన్నారు :

'చరిత్ర ఒక్కసారిగా మార్పు చెందటం మనం చూస్తాము. చరిత్రలో జరుగుతున్న ఈ బ్రహ్మాండమైన మార్పు...130 సంవ త్సరాల ఈ వ్యవస్థని మార్చి దానిస్థానే మరొకటి ప్రవేశిస్తుంది. గతంలోకి చూసిన చరిత్రకారుడెవరైనా తప్పకుండా భారత దేశంలో ఈ సంస్థానాలు చేరటం అనే అయిక్యతను చరిత్రలోనే ఒక మహత్తర మైన దశగా పరిగణిస్తాడు.'

ఈ అయిక్యత భారతీయ మహారాజాలు కాంగ్రెస్ నాయకుల్ని, రాజ్యాంగ నిర్ణయ సభలోని భారతీయ ప్రతినిధుల్ని నమ్మడం వల్లనే సాధ్యపడింది స్వతంత్ర భారతదేశం మొదటి దేశీయాంగ మంత్రి సర్దార్ పటేల్ యిచ్చిన హామీని కాంగ్రెస్ దేశీ యాంగ మంత్రి శ్రీ చవాన్ తిరస్కరిం చడం విధి విలాసమనే అనాలి. శ్రీ చవాన్ మహారాష్ట్రుడు. మహారాష్ట్రులు తమ పార్టీ వ్యక్తుల హామీలను ఆమోదించ డంలో పేరు పొందినవారు.

హైదరాబాద్, కాశ్మీర్‌ల విషయం మరో రీతిగా ఉంది. కాశ్మీర్ మహారాజా సర్ హరిసింగ్ దేశభక్తిని తగ్గించడానికి పండిత నెహ్రూ ప్రచారంవల్ల అయినా, షేక్ అబ్దుల్లాని ఆకాశాని కెత్తినప్పటికీ వాస్తవం మాత్రం మహారాజా సర్ హరి సింగ్ సంతకంకోసమే కాని కాశ్మీర్ ఈరోజువరకూ ఇండియాలో భాగంగా ఎప్పుడూ లేదు. సర్ హరిసింగ్ పట్ల పండిట్ నెహ్రూ ఎంత అలక్ష్యంగా ప్రవ ర్తించారన్న చరిత్రలోని వాస్తవం భారత ప్రథమ ప్రధానమంత్రికి వ్యతిరేకంగా నిలు స్తుంది. చివరికి ఆయనే సర్ హరిసింగ్‌కి ఆయన భార్యకీ, కుమారునికి భరణం నిర్ణ యించారు. ప్రస్తుతం శ్రీమతి గాంధీ కాబినెట్‌లో ఉన్న సర్ హరిసింగ్ కుమా రుడు తనకిచ్చిన భరణాన్ని వదులుకోడానికి అంగీకరించవచ్చు. శ్రీమతి గాంధీ తమ తండ్రి సర్ హరిసింగ్‌కి, ఆయన కుటుం బానికి యిచ్చిన మాటను తిరస్కరించడం అన్న విషయం ప్రధానమంత్రి నిర్ణయానికే వదిలివేయబడింది. హైదరాబాద్ విషయం యింకొక రకం. హైదరాబాద్ నిజాం ఇండియాలో కలవడానికి అనంగీకా రాన్ని తెలిపారు. ప్రభుత్వం సైనిక చర్య తీసుకున్నది. ఆయన లొంగిపోయిన తర్వాత సర్దార్ పటేల్ మామూలుగా ఆయన్ని ఆదరించారు. పండిత నెహ్రూ, భారత దేశం లౌకిక సిద్ధాంత ప్రతిబింబాన్ని విదే శాల్లో నిలబెట్టడానికి నిజాంకి కోటి రూపాయలు ఏటా యిచ్చేట్లు నిర్ణయిం చారు. తర్వాత చేసుకున్న ఒప్పందం ప్రకారం అది 50లక్షలకి తగ్గించారు. ప్రస్తుతం అది 20లక్షలకు తగ్గింపబడింది. తన ఉద్యోగులను భరించాల్సి ఉంది కాబట్టి తనకిచ్చే ఆ స్వల్ప మొత్తాన్ని పెంచమని కోరారాయన.

శ్రీమతి గాంధీ విదేశాల్లో

(10 వ పేజీ చూడండి)

## లోకం పోకడ

— భారత ప్రభుత్వం ఆర్థిక విధానాలు దేశశ్రేయస్సుకి, వాస్తవానికి ఎంత అను చితంగా ఉన్నాయో దాని విదేశ విధానం కూడా అంత అనుచితంగా ఉన్నది.

22.7.67 స్వరాజ్యలో శ్రీ కె. సంతానం

* * *

— పశ్చిమ ఆసియా ప్రమాద పరిస్థితి పట్ల భారత ప్రభుత్వం అవలంబించిన విధానం స్వతంత్రమయినదనీ, గౌరవ కారణ మనీ (భారత ప్రభుత్వం) అనవచ్చు.

19.7.67 స్టేట్‌స్‌మన్.

* * *

ఇస్రాయిల్ దురాక్రమణ చేసిందంటు న్నాము: (1956 లో బ్రిటన్, ఫ్రాన్సుల ఆలోచితో ఇస్రాయిల్ దురాక్రమణకి పూనుకుందని అందరికీ తెలుసు.) కాని, ఈజిప్టు, ఇతర అరబ్బు రాజ్యాలు ఆ దేశం ఎల్లలమీద పోగయ్యారనీ, అయిక్యరాజ్య సమితి శాంతిసేనలు తప్పుకోవాలని కోరారనీ, అకాబా ఖాతం మూసివేసి తమ 'వేలి'ని మెడకి ఉరిగా మార్చారనీ, ఇస్రాయిల్‌ని నాశనం చేసి అందులోని ప్రజలని సముద్రంలోకి తరుముతామని నిష్కర్షగా చెప్పారనీ మరిచి పోతున్నారు.

14.7.67 న్యూస్టేట్స్‌మన్‌లో కింగ్స్‌లే మార్టిన్.

* * *

— తిరుపతి దేవస్థానం వారు ముగ్గురు ఆఫీసర్లని రోమ్‌కి పంపుతున్నారు. కాథలిక్ ఆచారాలు, పద్ధతులు తిరుపతిలో అమలు జరిపే అవకాశం ఉందో లేదో చూడటానికని వీరు అక్కడికి వెళుతున్నారు. ఈ ముగ్గురి జట్టు ఆగస్టులో బయలుదేరుతుంది.

తిరిగి వచ్చేటప్పుడు ఈ జట్టు తిరు పతిలో ఇస్లామ్ ఆచారాలు ప్రవేశపెట్ట వచ్చునేమో చూడటానికి మెక్కా కూడా వెళ్ళ వచ్చు.

28.7.67 ఆర్గనయిజర్ వార్త.

* * *

— పీపుల్స్ డెయిలీ తన సంపాదకీయంలో (మావో ట్సెటుంగ్ పోయిన ఏడు యాంగ్ ట్సె నదిలో చేసిన) ఈతని పొగుడుతూ ౦౦౦ చైనా ప్రజలకి, మొత్తం ప్రపంచానికి ౦౦ యుద్ధ ములో ముందుకి పోవటానికి ప్రోత్సాహం ఇచ్చిందన్నది.

16.7.67 రాయిటర్ వార్త.










సాలిటెయిర్‌తో జాక్సన్విల్‌లో దిగిపోయి తీరం'దాకా పోయే 'త్రూ' ఎక్స్‌ప్రెస్ కోసం కాచుకుందామని నిశ్చయించుకున్నాను.

తర్వాత రయిలు ఆపి టామీ గన్లతో కాల్చారు. లోపలవుంటే చనిపోయి వుండేవారము.

అంతటితో ఆగక మా పుల్మాన్ కోచ్‌ని పేల్చి ముక్కలు ముక్కలు చేశారు. అంటే నేనూ సాలిటెయిర్ 'అధికారయుతంగా' చనిపోయినట్లే లెక్క.










"క్లియర్వాటర్‌లో నిన్ను ఒకలాడ్జిలో పెడ్తాను— ఈ దేశంలోనుంచి జమయికా పంపివేసేదాకా. అక్కడ ప్రమాదమేమీ ఉండదు."

"మరి నువ్వో జేమ్స్? నువ్వేం చేస్తావు?"

"ఇక్కడ కోస్తాకి రాగానే మిస్టర్ బిగ్ నావ ఏం చేస్తుందో చూడపోతున్నాను—"

కాని మమ్మల్ని వాళ్ళు చూసివేశారు.










మిస్టర్ బిగ్ ఉద్యోగులలో ఒకడు నన్నూ సాలిటెయిర్నీ చూశాడు......

"అనుమానంలేదు! పెద్దాయన ఆడదే! మిస్ సాలిటెయిర్—ఆయన వూళ్లో ఉన్నట్లు చెప్పి ఉండవలసింది..... .."

'న్యూయార్క్‌లో ఉన్నాడులే కాని మంచి సమాచారమే ఇచ్చావు, థాంక్స్!'

సముద్రంమీదకి పెద్ద కిటికీలున్న గది ఒకటి తీసుకున్నాము స్వర్గంలాగ ఉన్నది, కాని—




"నువ్వు చచ్చిపోయావుట"
ఫెలిక్స్ మేము పేలిపోయిన ఆ రయిలుబండితో చనిపోయామనుకున్నాడు.

"పోలేదు కాబట్టి, ఇప్పుడేం చెయ్యాలి?"

"మిస్టర్ బిగ్ నావల కోసంవాడే గట్టు దగ్గిర కెళ్ళి సాలిటెయిర్ని శీఘ్రంగా జమయికా పంపిం చెయ్."

"ఇక్కడినుంచి వెళ్ళిపోవాలని ఉంది. వాకేదో అనుమానం కలుగుతోంది......."

"ఇక్కడేమవుతుంది? గంటలో తిరిగి వచ్చే స్తాము......."




"ముందు 'గజదొంగ' అనే వాడిని చూసి వద్దాము. అతను మిస్టర్ బిగ్ ప్రతినిధి, ఇక్కడ. ఎర ఫాక్ టరీ ఉంది......."

కాని మాకు స్వాగతం లభించలేదు.....

"అది హెచ్చరిక మాత్రమే! ముందిక్కడ నుంచి తప్పుకోండి చిన్నరూ....."




...ళ్లివద్దాము. పక్క తలుపులేని గిడ్డంగి ఎక్కడుందిలే!

కాని సాలిటెయిర్ని వదిలివెళ్ళినచోట—
"ఓ. కె. మిస్టర్, నువ్వు చెప్పిన రేడియో గ్రామ్......"

"బయల్దేరండి అమ్మాయిగారూ! బట్టలేసుకో. వేషాలేశావా లోపలికి గాలి వెడుతుంది....."

(ఇంకా వుంది)

అభియోగాలలో వింతలు

# మోటారుకార్ల దొంగకు వింత చికిత్స

ఇరవై సంవత్సరాలలోపు వయస్సు బాలుడతడు. బాలురందరివలే ఆరోగ్యంగానే ఉంటాడు. కానీ ఒకే ఒక లోపం — ఖాళీగా నిలబడి ఉండే మోటారుకార్లను తస్కరిస్తూంటాడు.

15 సంవత్సరాల వయస్సప్పుడు మొదటిసారి తమాషాగా ఒక మోటారుకారులో సవారీ చేశాడు ఈ లీడ్స్ బాలుడు. అప్పటినుంచీ 15 సార్లు ఇతరుల మోటారు కార్లలో — వారికి చెప్పకుండా, ఎవరి అనుమతీ లేకుండానే సవారీ చేశాడు. పోలీసులు నిర్బంధించారు. శిక్ష లనుభవించాడు. కానీ స్వభావం మారలేదు. బాలాపరాధులను సరిదిద్దే పాఠశాలకు పంపించారు — ప్రయోజనం లేకపోయినది. న్యాయస్థానాలు జుల్మానాలు విధించినవి. ప్రయోజనం లేకపోయినది.

ఆఖరికి మనస్తత్వ — చికిత్సా నిపుణుడు డాక్టరు ఎమ్. ఆర్. లీహి ఒక ఉపాయం కనిపెట్టారు. కృత్రిమంగా యీ బాలునికి విద్యుదాఘాతం కలిగించే చికిత్సచేసి చూడాలనుకున్నారు. లీడ్స్‌లోని సెయింట్ జేమ్స్ హాస్పిటల్‌లో యీ చికిత్స జరిగినది — పని చేసినట్టే కనిపించుతున్నది.

ఈ బాలుని జేబులో బ్యాటరీల పెట్టె ఒకటి ఉంటుంది. ఈ పెట్టెనుంచి ఎలెక్ట్రోడ్‌లను అతనిచేతికి కట్టారు. ప్లగ్ నుంచి మామూలుగావచ్చే విద్యుదాఘాతం యీ పెట్టెనుంచి వస్తుంది.

మోటారుకారును తస్కరించేప్పుడు కలిగే అనుభూతులను ఊహించవలసినదిగా యీ బాలుని డాక్టర్లు కోరారు. అట్లా ఊహించుకుంటున్నప్పుడు విద్యుదాఘాతం కలిగించారు. కొన్ని వారాల తరువాత స్వయంగా తనే యీ చికిత్స చేసుకొనగలిగాడు.

నిలబడి ఉంటే మోటారుకారు కనిపించినప్పుడల్లా విద్యుదాఘాతం కలిగించుకుంటున్నాడు. ఆస్పత్రి నుంచి విడుదల చేసేవాడు 'అద్భుతంగా ఉన్నది' అన్నాడు.

డాక్టరు లీహి ఇట్లా చెప్పారు: 'వ్యసనం నుంచి ఈ బాలునికి పూర్తిగా విముక్తి కలిగినదో లేదో, మరి కొంతకాలం పోతే కానీ చెప్పలేము. ఈ చికిత్స జయప్రదమైతే ఇట్టి అభియోగాలలో యీ పద్ధతిని ఉపయోగించాలనుకుంటున్నాము.'

త్రాగుడు వ్యసనం వంటి వాటిని మాన్పించడానికి విద్యుదాఘాత చికిత్స చేయడం ఉన్నది. కానీ మోటారుకార్ల దొంగను సరిదిద్దడానికి ఈ పద్ధతిని ఉపయోగించడం ఇదే మొదటిసారి.

—వి. ఎస్. అవధాని.




## న్యూఢిల్లీ లేఖ

(7–వ పేజీ తరువాయి)

భారతదేశం లౌకిక సిద్ధాంత ప్రతిబింబాన్ని వివరంగా చిత్రించడానికి చాలా శ్రద్ధ తీసుకుంటున్నారు. డాక్టర్ జాకీర్ హుస్సేన్ అధ్యక్షుడవటానికి ఆమె చేసిన తీవ్ర ప్రచారం, నిబంధనలేమీ లేకుండానే అరబ్‌లను బలపర్చడం దాన్ని విశదం చేస్తున్నాయి. నిజాం భరణాన్ని రద్దుచేస్తే అతను ముస్లిమ్ కాబట్టి లౌకిక సిద్ధాంత ప్రతిబింబానికి మచ్చరాదా?

ఇంకో ప్రమాదం కూడా ఉంది. అదను కోసం వేచి ఉన్న కాంగ్రెస్ కార్యాచరణ సంఘం ఇండియా విదేశీ రుణాన్ని నిరాకరించమని కోరవచ్చు. ఈ కోరికను అంగీకరించి రాజ్యాంగ బద్ధమైన న్యాయాన్ని కాదనగలరా శ్రీమతి గాంధీ? అలా జరిగిన పక్షంలో రాజ్యాంగం ద్వారా హామీ యివ్వబడిన ఈ ఒప్పందం నిరాకరణ అంతర్జాతీయంగా అపవాదును తెస్తుంది. ఇండియా విజాయితీపట్ల కమ్యూనిస్టు రష్యాతోపాటు నాగరిక ప్రపంచ దేశాలన్నిటిలోనూ ఉన్న నమ్మకం తీవ్రంగా చలించి పోవచ్చు. ప్రస్తుతం యిక్కడ ప్రపంచ బాంక్ సంఘం ఒకటే ఉంది. అది విశ్రుంఖలమైన భారత ఆర్థిక వ్యవస్థనే కాకుండా శ్రీమతి గాంధీ, శ్రీ చాగ్లా, రాజాదినేష్‌సింగ్‌ల ప్రకటనలను కూడా రికార్డ్ చేస్తున్నది.

విదేశీ మారక ద్రవ్యావసరానికి పేరు పొందిన ఇండియా 12 కోట్ల రూపాయలు సాంకేతిక సంబంధమైన అప్పుగా యు. ఏ. ఆర్. కి యివ్వగలిగితే ఇక విదేశీ సహాయమే ఇండియాకి అవసరం ఉండదు.

విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 10

అతను తన విశాలమయిన భుజాలని గోడకి ఆన్చి ఎక్కువ దిబ్బడికోసం ఎప్పుడూ వెంటనే ఉండే 'ఇన్‌హేలర్' వాసనచూస్తూ ఉండిపోయాడు. తలవంచి ముందు ఒక నాసికద్వారా, తర్వాత మరొక నాసికద్వారా గాఢంగా ఊపిరి తీశాడు. శ్రీమతి జాన్సన్ పక్కన గోడకి ఆనుకుని నిల్చుని ఉన్నది. అతన్ని చూస్తూ అలాగే ఉండిపోయింది. 'లిండన్, నేనూ మాట్లాడుకోలేదు.' అని తర్వాత జ్ఞాపకం తెచ్చుకున్నది ఆవిడ. 'ఊరికే ఒకళ్లనొకళ్ళం చూస్తూ ఉండి పోయాము. మా కళ్లతోనే ఎన్నో సందేశాలు ఇచ్చి పుచ్చుకున్నాము. ఎలా, ఏమి అవుతుందో గ్రహించాలిగాము—'

అయినా అసలు ఏమి జరిగిందో సరిగ్గా వారికీ తెలియదు. అందరిలాగే సమాచారం కోసం తహ తహ లాడుతూ అలాగే కాచుకుని ఉండిపోయారు. జాన్సన్ రాయ్‌కెల్లర్ మాన్‌ని రప్పించాడు.

'రాయ్ అధ్యక్షుడి పరిస్థితి ఎలా ఎలా ఉందో చెప్పగలవా?'

'అధ్యక్షుడు కెన్నెడీకి దెబ్బ తగిలింది. ఇంకా బతికే ఉన్నారు. పరిస్థితి అంత బాగా లేదు.'

'నాకు సమాచారం అందిస్తూ ఉంటావా?'

'ఎస్, సర్.'

కెల్లర్‌మాన్ హృదయపూర్వకంగానే అలా అన్నాడు కాని, తిరిగి ఆ ప్రదేశానికి తను రాడని అతనికి తెలియదు. సర్జరీకి వెళ్లగానే అతనికి కావలసినంతపని దొరికింది.

జాన్సన్ ఉన్న గదిలోకి కెన్ వోడాన్నెల్ తొంగిచూశాడు. 'ఏమీ బాగాలేదు, అధ్యక్షుడు మరణించా రనుకుంటున్నాను,' అన్నాడు, జాన్సన్ సమాధానం చెప్పలేదు.

ఒక ఏజెంటు నాణాలువేస్తే సరుకు ఇచ్చే యంత్రంమునుంచి కాఫీ తీసుకువచ్చి జాన్సన్ దంపతులకి ఇచ్చాడు. శ్రీమతి జాన్సన్‌కి విశేషమయిన వేళలని గురించి చిన్న డయరీ ఒకటి రాసుకునే అలవాటు ఉంది. ఇదంతా అందులో రాసుకున్నది ఆమె.

మరొక ఏజెంటు యంగ్‌బ్లడ్‌తో ఏదో టెలిఫోన్ చెయ్యమన్నాడు.

'ఈ మనిషిని ఎవరికోసమూ వదలి వెళ్లను,' అన్నాడు అతను పొడిగా. కాని. పార్క్‌లాండ్ ఆస్పత్రి వదిలి వెళ్లాలని మాత్రం అతనికి ఉంది. జాన్సన్‌పట్ల తన కర్తవ్యం నెరవేర్చాలంటే డల్లాస్ పట్నాన్నే వదలటం అవసరం అని అతని అభిప్రాయం.

అతని సహోద్యోగి ఎమెరీ రాబర్ట్స్ కూడా ఇది నిజమే, అన్నాడు. ఇద్దరూ జాన్సన్‌తో తమ మనస్సులో ఉన్నది చెప్పారు

వారికి తమ ఊహ సబబుగానే ఉన్నట్లు తోచింది. అయితే, మరణించిన అధ్యక్షుడికి సన్నిహితంగా ఉన్నవారికి కొత్త అధ్యక్షుడికి మానసికంగా ఎటువంటి దెబ్బ తగిలిందో ఎటువంటి వత్తిడికి అతను లోనవుతున్నాడో అర్థం కాలేదు. తను కొత్త పదవిని ఆక్రమించినట్లు జాన్సన్‌కి అవగాహన అయినట్లులేదు. ఆ నాడు నెం. 13గదిలో దిగాలుపడి మంచున్న వ్యక్తికీ తర్వాత గడసరి, నిబ్బరం కలవాడూ అనిపించుకున్న అధ్యక్షుడు జాన్సన్‌కీ పోలిక లేనేలేదు. ఆ సమయంలో అతను ఆజ్ఞలు జారీ చెయ్యటం కన్నా పుచ్చుకునేందుకే సిద్ధంగా ఉన్నాడు. అతని ధీమా అంతా కుంగిపోయింది. శాసన సభ్యుడు హోమర్ థార్న్‌బెర్రీతో, 'ఇది ప్రార్థనకి ఉచితమయినవేళ, హోమర్!' అన్నాడు.

ఈ గందరగోళం అధికం కావటానికి రెండు విషయాలు తోడ్పడ్డాయి. కొత్త అధ్యక్షుడు వచ్చేశాడన్న సంగతిని అర్థం చేసుకోలేనిది ఒక్క జాన్సన్ మాత్రమే కాదు. విచారంలో మునిగి ఉన్న కెన్నెడీ పరివారంలోని వారు చాలా మంది కూడా దీనిని స్వీకరించలేక పోయారు. అధ్యక్షుడి సైనికదళ కార్యదర్శి బ్రిగేడియర్ జనరల్ గాడ్‌ఫ్రే మెక్ హ్యూ ని ఏజెంట్లు విమానాలు తిరిగి వెనక్కి వెళ్లటానికి ఏర్పాట్లు చెయ్యమని కోరినప్పుడు అతను జాన్సన్ తన స్వంత విమానంలో వెళ్లవచ్చునన్నాడు — అంటే ఉపాధ్యక్షుడి విమానంలో.

'సీక్రెట్ సర్వీస్ ఏజెంట్లు' నాయకుడు జెర్రీ బెహ్న్ అసలు ఈ యాత్రకి రానే లేదు. ఇది సాధారణంగా జరగని పని. కాని, దాని ఫలితంగా మాత్రం రహస్య రక్షకభట దళానికి నాయకుడు లేకపోవటం మాత్రం జరిగింది. అతనే కనుక ఉండి ఉంటే అందరూ సహజంగా అతని వద్ద ఆర్డర్లు తీసుకుంటూ ఉండేవారు. అతనేమో వైట్ హవుస్‌లో తన గదిలో కూర్చుని టెలిఫోన్ రిసీవర్‌ని గట్టిగా బిగించి పట్టుకుని, రాయ్‌కెల్లర్ వద్ద నుంచి వార్తలకోసం ఎదురుచూస్తున్నాడు.

కెల్లర్‌మాన్ అతని డిప్యూటీ. న్యాయంగా చూస్తే అతను బెహ్న్ అధికారాన్ని తను తీసుకుని ఉండాలి. డల్లాస్‌లో ఆనాటి పరిస్థితులలో అతను అంతపని చెయ్యగలిగి ఉండేవాడా, అతనేకాదు మరెవరయినా సరే చెయ్యగలిగి ఉండేవాడా అన్నదే ప్రశ్న.



శ్రీమతి జాన్సన్

ఏజెంట్లు అందరిలోనూ చురుకయిన వాడు యంగ్స్‌బ్లడ్. రాబర్ట్స్‌తో కలిసి ఒక పథకం తయారుచేశాడు. ఇద్దరూ రాయ్ కెల్లర్‌మాన్ మాట వినే స్థితిదాటి పోయారు. కొత్త అధ్యక్షుడిని ఆస్పత్రి నుంచి తీసుకు వెళ్ళటానికి నిశ్చయించు కున్నట్లు ఏజెంట్ల నాయకుడికి తెలియనే లేదు.

గది నెం 13: రాబర్ట్స్ జాన్సన్‌తో తను కెన్నెడీ తలమీది దెబ్బ చూశానన్నాడు. 'అధ్యక్షుడు దాన్ని తట్టుకోలేరు. ఇక్కడి నుంచి పోదాం పదండి!' అన్నాడు.

'దీని అంతు తెలియటం లేదు. ముందు ఇక్కడి నుంచి వెళ్ళాలి' అన్నాడు యంగ్స్‌బ్లడ్.

'కార్స్‌వెల్‌కి వెళ్ళటం వీలవుతుందా?' జాన్సన్ సందేహిస్తూనే అడిగాడు. కార్స్‌వెల్ ఫోర్ట్‌వర్త్ దగ్గరగా ఉన్న విమాన స్థావరం.

దారి కనుక్కోనటానికి లెమ్‌జాన్స్ అనే ఏజెంటుని పంపారు. అతను వివరాలు కనుక్కొని వచ్చాడు. అది మరీ దూరమయిన ప్రదేశం అని అందరూ అంగీకరించారు.

'ఏమయినా విమానంలో ఎక్కి వెళ్ళిపోవాలి ముందు,' అని వత్తిడి చేశాడు రాబర్ట్స్.

ఇంకా సందేహిస్తూనే జాన్సన్, 'ఒక వేళ అధ్యక్షుడు కెన్నెడీకే విమానం కావలసి వస్తే,' అన్నాడు.

ఏ విమానం గురించి జాన్సన్ మాట్లాడుతున్నాడో అడుగుదామనే ఊహ ఎవరికీ కలగలేదు. అక్కడి విమానాశ్రయంలో రెండు ప్రత్యేక విమానాలు ఉన్నాయి. ఒకటి అధ్యక్షుడిదీ, రెండవది ఉపాధ్యక్షుడిదీ. రెండూ అన్నివిధాలా సమానమయినవే. రెండిటికీ ఒకేరకం సాంకేతిక సామగ్రి, సిబ్బంది ఉన్నాయి. కాని, అందరూ ఉపాధ్యక్షుడి విమానం సంగతి మర్చిపోయారు. తను 'ఎయిర్ ఫోర్స్ వన్' లో ఎక్కితే ఉచితంగా ఉండదేమో, అనే శంక జాన్సన్‌ని పీడిస్తోంది. కెన్నెడీ పరివారంలో ఎవరో ఒకరి ఆమోదం లేనిదే తను కదలటం బాగుండదని ఏజెంట్లతో అన్నాడు. వీలయితే కెన్ వోడాన్నెల్‌ని అడగవలసిందని కోరాడు. రాబర్ట్స్ వోడాన్నెల్ వద్దకి వెళ్ళాడు.

'జాన్సన్ వెళ్ళాలంటున్నాడు, విమానం ఆయన వాడవచ్చు కదా?' అని అడిగాడు. వోడాన్నెల్ తల ఊపాడు.

'కెన్ సరేనంటున్నాడు,' అని జాన్సన్‌తో వెళ్ళి చెప్పాడు రాబర్ట్స్. కాని జాన్సన్ కదలటం వాయిదా వేశాడు. 1:13 కి ఎమరీ రాబర్ట్స్ అతనితో అన్నాడు: 'అధ్యక్షుడు మరణించాడు సర్!'

ఈ వార్త విని అదిరిపడ్డ జాన్సన్ భార్యతో, 'వేళ రాసుకో!' అన్నాడు. 'మనం ఇక వెడదాము. ఏ హడావుడీ లేకుండా వెడదాము.'

యంగ్స్‌బ్లడ్ జాన్స్‌తో, 'సాధారణంగా కనిపించే కారు ఒకటి తీసుకురా! డల్లాస్ బాగా తెలిసిన పోలీసువాడిని తీసుకురా!' అన్నాడు.

'శ్రీమతి కెన్నెడీని, నెల్లీని చూడాలి.' అన్నది శ్రీమతి జాన్సన్. ఆమె భర్త ఆమె సూచనని ఆమోదించటమే కాక తనూ వెంట వస్తానన్నాడు. యంగ్స్‌బ్లడ్ అతను ఈ వార్డు వదిలి వెళ్ళటానికి వీలు లేద న్నాడు.

* * *

ఫాదర్ హ్యూబర్ తన కారు తలుపు తెరుస్తూ ఉండగా కొందరు విలేఖరులు అతనిచుట్టూ మూగారు. 'చనిపోయాడా?' అని అడిగాడు 'టైమ్' పత్రిక ప్రతినిధి హ్యూగ్ సిడీ.

ఫాదరీ దీర్ఘంగా ఊపిరి పీల్చాడు.

'ఆ, చనిపోయాడు,' అన్నాడు కాని, కేవలం ఒక ఫాదరీ చెప్పినమాట అధికార పూర్వకం అయినది మాత్రం కాదు.

ఫాదరీ సమాచారం బయట పెట్టేశాడని లోపలి వారికి తెలియదు. అయినా, ఇటు వంటి వార్తని ఎంతసేపని తొక్కి పట్ట గలరు? కిల్డఫ్ కెన్ వోడాన్నెల్‌ని పవిశాపించి, 'మరణించాడు కదూ?' అని అడిగాడు. 'అవును,' అన్నాడు వోడాన్నెల్.

'ఈ విషయమయి ఈ సమయంలో ఇలా గుర్తు చెయ్యటం బాగా లేదని నాకూ తెలుసు కాని అధ్యక్షుడు కెన్నెడీ మరణ వార్త ప్రపంచానికి తెలియ చెయ్యాలి,' అన్నాడు కిల్డఫ్.

'వాళ్ళకి తెలియదంటావా?'

'నేను చెప్పలేదు.'

'సరే ప్రకటన నువ్వే చెయ్యాలి, వెళ్ళు!' అన్నాడు వోడాన్నెల్,' అయినా లిండన్ జాన్సన్‌కి చెప్పి చెయ్యటం మంచిది.

మరొక ఏజెంటు కిల్డఫ్‌ని ఆస్పత్రి గదులు వ్యూహంద్వారా జాన్సన్ ఉన్నచోటుకి తీసుకు వెళ్ళాడు. అటు తిరిగి ఉన్న జాన్సన్ విశాలమయిన వీపు కనిపించింది కిల్డఫ్‌కి. గొంతుక సవరించుకుని కెన్నెడీ నౌకరునుడితో 'మిస్టర్ ప్రెసిడెంట్!' అన్నాడు.

ఈ విధంగా జాన్సన్‌ని అంతకి ముందు ఎవరూ సంబోధించలేదు. తిరిగి కిల్డఫ్ వంకచూశాడు. ("నేను డోనాల్డ్‌డక్ లాగ కనిపించి ఉంటాను ఆయనకప్పుడు," అని

పార్క్‌లాండ్ ఆసుపత్రి

తర్వాత జ్ఞాపకం తెచ్చుకున్నాడు కిల్డఫ్.)

ఒక ప్రకటన చెయ్యటానికి అనుమతి కావాలన్నాడు కిల్డఫ్. జాన్సన్ తల అడ్డంగా ఆడించి, 'ఆగు! ఇది కమ్యూనిస్టు కుట్ర అవునో కాదో తెలీదు. ముందు నేను విమానం దగ్గరకి వెళ్ళిపోతాను. నన్నిక్కడి నుంచి పంపించటానికి సిద్ధంగా ఉన్నారా?'

రహస్య రక్షకభట దళం సిద్ధంగానే ఉన్నట్లు అతనికి తెలుసు. కాని విలేఖరులకి చెప్పేముందు పార్క్‌లాండ్ ఆస్పత్రి వదిలి వెళ్ళిపోవాలని అతని ఉద్దేశం. తక్కిన

విలేకరులతో సంప్రదించిన కిల్డఫ్ ఈ సంగతి అర్థం చేసుకున్నాడు. 1:20 కి మళ్లీ జాన్సన్‌ని సమీపించి, 'మీరు వెళ్లగానే ప్రకటన చేస్తాము.' అన్నాడు.

'సరే, నేను వెళ్లిపోగానే మరణం విషయం బయటపెట్టు' అన్నాడు జాన్సన్.

ఇద్దరూ 'ఎమర్జెన్సీ' ద్వారం గుండా బయటపడ్డారు. ఎండలోకి రాగానే వారిని చూసి విలేఖరులు, 'మాకేమి చెప్తా'రని అరిచారు. కిల్డఫ్ తలవంచి వృషభంలాగ వారందరి మధ్యనుంచి తోసుకుని విలేఖరులంతా గుమిగూడిన గదులవయిపుకి వెళ్లిపోయాడు.

అతనికళ్లు ఎర్రబడిఉన్నాయి. మాట తడబడింది. 'సరే రోడ్డు ప్రయాణాలలో నేనుచేసే పత్రికావిలేఖరుల సభ మొదటిది ఇదే' అనుకున్నాడుట అప్పుడు. అతని ఆలోచనలు గజిబిజిగా ఉన్నాయి.

'క్షమించండి. కొంచెం శ్వాస పీల్చుకోనివ్వండి' అన్నాడు. ఊపిరి బిగపట్టాడు. కొన్నిక్షణాలు గడిచాయి. 1:33 కి పెదిమలు తడిచేసుకున్నాడు కిల్డఫ్. 'అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ...'

'ఆగండి!' అని కేకవేశాడు ఒక ఫొటోగ్రాఫర్. కెమెరా 'క్లిక్' మన్నది.

'అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడి సుమారు ఒంటిగంట, సెంట్రల్ స్టాండర్డ్ టైమ్స్‌కి ఇక్కడ డల్లాస్‌లో మరణించారు.'

1:35 కి ప్రపంచం అంతటా యు.పి. అయి టెలిప్రింటర్ యంత్రాల గంటలు మోగాయి.

'ఫ్లాష్

ప్రెసిడెంట్ కెన్నెడి డెడ్

జె. టి. 135 పి. [illegible] ఎస్.'

కెన్నెడి మరణ వార్తని జాన్సన్‌తో కెంపటూరు చెప్పాడు వోడాన్నెల్. తను 'ఎయిర్ ఫోర్స్ వన్' విమానంలో ప్రయాణం చెయ్యవలసిందని అతనే సూచించాడని తనకి గుర్తు అని జాన్సన్ తర్వాత అన్నాడు. శ్రీమతి కెన్నెడి, ఆమె భర్త శవం విమానం వద్దకి వచ్చేదాకా తను ఉండాలనే షరతు పెట్టినట్లు చెప్పాడు.

'ఇది పూర్తి అబద్ధం' అన్నాడు వోడాన్నెల్. ఈ ప్రసక్తి తీసుకు వచ్చింది జాన్సనే అని, 'అయన ఆ చోటు ఎంత త్వరగా వదిలి వెళ్లితే అంత మంచిదని నేనూ ఒప్పుకున్నా'నని అన్నాడు. 'విమానాలు కదిలించవచ్చునా?' అని అయన

# అధ్యక్షుని మరణం

అడిగారు. ఉపాధ్యక్షుడి (విమానం) 'ఎయిర్ ఫోర్స్ టు' గురించి మాట్లాడుతున్నారేమోనని, కార్స్‌వెల్ స్థావరం దగ్గర కేమోనని వీళ్లేదన్నాను: ఆ స్థావరానికి 35 మైళ్ల దూరం. అదీకాక విమానం కదిలించటానికి చాలాసేపు పడుతుంది. అసలు మేము పార్క్‌లాండ్ ఆస్పత్రి నుంచి లవ్ ఫీల్డ్ వెడుతున్నట్లు ఎవరికి తెలుస్తుంది? వీల్లేదే!'

26000 సంగతి—'ఎయిర్ ఫోర్స్‌వన్' గురించి నేనూ అధ్యక్షుడూ మాట్లాడుకోనేలేదు. ఆయన ఎయిర్‌ఫోర్స్ వన్‌లో వెడుతున్నాడని తెలిస్తే మేము ఎయిర్ ఫోర్స్ టూలో వెళ్లేవాళ్లము. రెండూ ఒకేరకం విమానాలు—' అన్నాడు వోడాన్నెల్ తర్వాత.

యంగ్స్‌బ్లడ్ జాన్సన్ 'పొక్కాల్నే' బల పరిచాడు, కాని వోడాన్నెల్ మాత్రం గంట తర్వాత జాన్సన్ దంపతులని '26000' లోపల చూసి ఆశ్చర్య పడిపోయాడు. ఈ విషయంలో కొంత అపార్థానికి తావు ఉంది. జాన్సన్ ఎయిర్‌ఫోర్స్ వన్ గురించి ఆలోచిస్తున్నప్పుడు వోడాన్నెల్ రెండవ విమానం గురించి ఆలోచిస్తూ ఉండి ఉండవచ్చు. కాని, వోడాన్నెల్ జాన్సన్ [illegible] శ్రీమతి కెన్నెడీ కోసం నిరీక్షించమని చెప్పి ఉంటాడంటే నమ్మటం కష్టం—అందులో రెండు విమానాలు సిద్ధంగా ఉన్నప్పుడు. జాన్సన్ శీఘ్రంగా ప్రయాణం కట్టాలనుకుంటున్నాడని వోడాన్నెల్‌కి తెలుసు. అధ్యక్షుడి పతి



మణి తన భర్త శవంతోనే ఆ చోటు వదిలి వెళ్లగలదన్న సంగతి అతనికి తెలుసు, దాని వల్ల ఆలస్యం అవుతుందని కూడా తెలుసు. మరి ఈ రెండు రకాల అభిప్రాయాలు, ఊహలు కలగటానికి కారణం ఏమిటి? కొత్త ప్రధాన సేనాధిపతి (భారతదేశంలో వలెనే అధ్యక్షుడే ప్రధాన సేనాధిపతి) పడిపోయిన సేనాధిపతి పక్కనే ఉండి హత్యవల్ల అమలులో ఉన్న 'ప్రమాద పరిస్థితి'ని ఎదుర్కోనటానికి నిశ్చయించుకుని ఉంటాడు. ఇది వోడాన్నెల్‌కి అర్థం అయి ఉండదు.

డల్లాస్ పోలీసు ముఖ్యాధికారి లవ్‌ఫీల్డ్ విమానాశ్రయానికి తన దళం కావలా పెట్టాడు. రెండు సాధారణంగా కనిపించే కార్లు సిద్ధంగా ఉన్నాయి ఆస్పత్రి బయట. రెండిటి ఇంజన్లు నడుస్తూనే ఉన్నాయి. ఒకదానిని పోలీసు ముఖ్యాధికారి జెస్సెకర్రీ స్వయంగా నడుపుతున్నాడు.

నర్సుల స్టేషన్‌వద్దనుంచి గాడ్ ఫ్రే మెక్‌హ్యూ తన ఏర్పాటు చేసుకుంటున్నాడు. కెన్నెడీ దంపతులకోసం ప్రత్యేకంగా ఒక విమాన ప్రయాణం ఏర్పాటుచేస్తున్నాడు. కల్నల్ జీమ్ స్వెండాల్‌కి టెలిఫోన్ చేసి డల్లాస్ విమానాశ్రయంలో మరొక మూలకి జరిగి ఉండమన్నాడు. స్వెండాల్ ఈ విషయమయి ఒక పోలీసు అధికారిని సంప్రదించి మెక్‌హ్యూ ఆజ్ఞని శిరసావహించకుండా వదిలివేశాడు. అతని నిర్ణయం సరయినదే 'లవ్‌ఫీల్డ్' ఆశ్రయంలో అంతకన్నా సురక్షితమయిన చోటులేదు. అసలు, ఆచోటు ఎంత సురక్షితమయినదీ అంటే అది వేరే విషయం.

లవ్‌ఫీల్డ్ ఆశ్రయంలో జరుగుతున్న రక్షణ ఏర్పాట్లు వైట్‌హవుస్ సమాచార శాఖ అధిపతి కర్నల్ జార్జ్ మెక్నాల్లీకి నచ్చలేదు. డల్లాస్ పోలీసువారు 'వెర్రి వాలకంతో ఇటూ అటూ పరిగెడుతున్నా'రన్నాడు. కొత్త అధ్యక్షుడికి తగినంత రక్షణ లభించటంలేదని అతని అభిప్రాయం. హంతకుడికి తగిన సహకారమే కనక దొరికి ఉంటే, అటువంటిదే కనక సంభవించి ఉంటే కుట్రలో పాల్గొన్నవారు 'విమానాన్ని, అన్నిటినీ కూడా ఎత్తుకుపోయి ఉండేవచ్చు' అన్నాడు.

(ఇంకా ఉంది)

# ఇప్పుడు మీరు కాల్చబోతున్న సిగరెట్టు అమ్మకంలో ఇతర రకాలన్నిటిని దాటిపోయింది...



## పొగాకు ఎంతశ్రేష్ఠమో, రుచి అంతశ్రేష్ఠము

మొట్టమొదటి పీల్పుతోనే అది చార్మినార్ అని తెలుసుకుంటారు. రుచిలో ఒక ప్రత్యేకత ఉన్న సిగరెట్టు అది. శ్రేష్ఠమైన పొగాకులను ఏరికూర్చి, వజీర్ సుల్తాన్ వారు మెలుగు చేసిన రుచి యిది. ఆ ప్రసిద్ధమైన రుచిని కలుగ జేయడానికి జాగ్రత్తగా పొగాకులను బాగుచేసి, ముమ్మారు పరిపక్వం గావించినారు.




అపమానమైనది

# చార్మినార్

ఇండియాలోకెల్ల గొప్ప సిగరెట్టు



వజీర్ సుల్తాన్ తయారీ

GMVS-24 Tel




తల్లిదండ్రులకు తమ సంతానంపైని ప్రేమవాత్సల్యాలు ఉండడం సహజం. అందులోనూ తల్లికుండే వాత్సల్యం ఎక్కువ. కొడుకు తల్లి విషయంలో చెడ్డగా ప్రవర్తించినా సరే, తల్లి మాత్రం కుమారుని శ్రేయస్సునే కోరుతుంది. ఈ విషయాన్నే పెద్దలు 'కుపుత్రో జాయేరవ్ క్వచిదపి కుమాతా నభవతి' అని చెప్పి వున్నారు.

ఈ విధంగానే అజ్ఞానం వల్లగాని, దురహంకారం వల్లగాని మానవుడు భగవంతుని పట్ల అవినయంగా ప్రవర్తించినా భగవంతుడు వాత్సల్యాన్నే చూపి మేలు కలిగిస్తాడేగాని కీడు కలిగించడు. ఇది అవతారమూర్తి అయిన శ్రీ కృష్ణుని విషయంలో బాగా తెలుస్తుంది.

భారత మహాయుద్ధం ముగిసింది. కౌరవ వినాశం జరిగింది. పాండవులు జయించారు. ధర్మరాజు కౌరవ రాజ్యానికి పట్టం కట్టుకున్నాడు. పాండవ పక్షపాతియైన శ్రీ కృష్ణభగవానుడు కొన్నాళ్ళపాటు పాండవులదగ్గరే ఉండి, తర్వాత తలిదండ్రులనూ, బంధువర్గాన్నీ చూడడానికి ద్వారకకు బయలుదేరాడు. తన యేకైక పుత్రుడూ, మహావీరుడూ అయిన అభిమన్యుని మరణంతో దుఃఖంలో మునిగివున్న చెల్లెలు సుభద్రను కొన్నాళ్ళపాటు ద్వారకలో దుఃఖోపశమనం కోసం ఉంచుకొనుటకు ఆమెను కూడా తనతో బయలుదేరించాడు.

మజిలీలు వేస్తూ, చేస్తూ ప్రయాణం చెయ్యడంలో మార్గమధ్యంలో ఉదంకుడనే ఋషిని శ్రీకృష్ణుడు సందర్శించాడు.

ఉదంకుడికి కౌరవపాండవుల విరోధాన్ని గురించే తెలుసునుకాని, యుద్ధం జరిగిన సంగతి, పాండవులు విజేతలై రాజ్యాన్ని పరిపాలిస్తున్న సంగతీ తెలియదు. అతడు శ్రీకృష్ణునితో 'అయ్యా! మీరు హస్తినాపుర ప్రాంతాన్నుంచే వస్తున్నారు కదా! కౌరవ పాండవులకున్న తగాదాలు పరిష్కారమై సంధి కుదిరిందా? వారందరూ సుఖంగా ఉన్నారు కదా!' అని అన్నాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ 'అయ్యా! మీ కింకా యిది తెలియనే తెలియదా? వారిద్దరిమధ్యా రాయబారాలు నడిచాయి. సంధి ప్రయత్నాలు జరిగాయి. కాని ప్రయోజనం లేకపోయింది. యుద్ధం తప్పనిసరి అయింది. కౌరవులంతా యుద్ధంలో మరణించారు. పాండవులు గెలిచారు. ఇప్పుడు ధర్మరాజే రాజ్యం పాలిస్తున్నాడు' అని సమాధాన మిచ్చాడు.

శాంతినికోరే ఉదంకుడికి యీ సంఘటన ఎంతో వేదనను కలిగించింది. శ్రీకృష్ణుడు సర్వసమర్థుడని అతనికి తెలుసును. అట్టి శ్రీకృష్ణుడు అక్కడ ఉండి కూడా యుద్ధాన్ని ఆపనందున అతని మీద మునికి కోపం వచ్చింది. తాను మహాతపశ్శాలిననే అహంకారంకూడా అతనికి ఉన్నది. ఆ ముని చాలా తొందరపాటుతో 'కృష్ణా! నువ్వు తలచుకుంటే యుద్ధం నిలపలేవా? కౌరవుల వినాశమే నీ సంకల్పం! అందువల్లనే ఉపేక్షించావు. ఈ మహాఘోరానికి కారకుడవు నీవు. నిన్ను శపించినా తప్పులేదు' అని అన్నాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు 'అయ్యా! తొందరపడకు. ప్రయత్నమనేది పరాధీనం! దైవాన్ని ఎవ్వరూ అతిక్రమించలేరు. కౌరవులు వారి పాపకర్మలకు తగిన ఫలాన్ని అనుభవించారు. కర్మవిపాకాన్ని ఎవ్వరూ తప్పించలేరు. ఇదిగో! నువ్వు నన్ను శపిస్తానంటున్నావు. దానివల్ల నీకు జరిగేది, నాకు పోయేదీ ఏమీ లేదు. శపించి, నిష్కారణంగా నీ స్వల్ప తపస్సును వ్యర్థం చేసికోకు. దాన్ని ఏదయినా సత్కార్యానికి ఉపయోగించుకో' అని యెంతో శాంతంగా సమాధానమిచ్చాడు.

ఉదంకుడు తన తప్పు గ్రహించాడు. అతని అహంకారం తొంభైపాళ్ళు తగ్గిపోయింది. శ్రీకృష్ణుడే భగవంతుడని అతనికి తోచి, పెక్కువిధాల స్తుతించి, అతని విశ్వరూపాన్ని చూపవలెనని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడున్నూ ఉదంకుని కోర్కెను తన విశ్వరూపాన్ని ప్రదర్శించి 'ఓంబా నీవు కోరినప్పుడు ఎడారిభూములో ఉన్నప్పటికి నీకు జలం లభిస్తుంది' అని వరం యిచ్చి వెళ్ళిపోయాడు.

తర్వాత ఉదంకుడికి విపరీతమైన దాహం కలిగింది. అతడు 'నీరు కావా'లని మనస్సులోనే అనుకున్నాడు. అప్పుడు వివస్త్రుడైన ఒక చండాలుడు వచ్చి, తన జఘన ద్వారం నుంచి జలాన్ని స్రవింపజేస్తూ, దాన్ని తాగమని చెప్పాడు. ఉదంకుడు మిక్కిలి అసహ్యించుకొని, ఆ జలాన్ని తిరస్కరించాడు. 'ఇది శ్రీకృష్ణుని మోసం' అని అనుకొంటూవుండగా, శ్రీకృష్ణుడే ప్రత్యక్షమైనాడు. ఉదంకుడు దర్పంతో బాధపడుతూ వుంటే చూడలేక శ్రీకృష్ణుడు 'నీవు ఈ

(64 వ పేజీ చూడండి)



# శాసనసభ వనితామణులు-5



రాణీ రమాకుమారిదేవి

'తెలుగు-హిందీ స్వయం శిక్షక్' పుస్తకం టేబుల్‌మీద కనిపించింది. ప్రశ్నార్థంగా చూశాను.

'అవునండి, నేర్చుకుంటున్నాను. త్వరలోనే శాసనసభలో తెలుగులో మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నాను' అని రాణీ రమాకుమారిదేవిగారు ఇంగ్లీషులో చెప్పారు దరహాసిస్తూ. హిందీ ఆమె మాతృభాష అయినా, తెలుగుమాట అంటే హృదయం ఉంది; వాగ్విలసనం ఇంకా సమకూరలేదు.

మేలిముసుగుతో మేనుకప్పుకొని, అల్లనల్లన ఆమె శాసనసభామందిరంలోనికి ప్రవేశించే తీరులో సహజమైన రాజసం కనిపించినా, ఆడంబరాలు కనిపించవు. విశాఖపట్నంలోని సుందరహర్మ్యంలో జీవించినా, ఎమ్.ఎల్.ఏ. క్వార్టర్సులోని అతి సాధారణమైన గదిలో ఉండవలసి వచ్చినా, ఆమె దృష్టి కొండజాతులపైనే ఉంటుంది. రాజవంశంలో జన్మించినా, సోషలిజం ఆమె జీవలక్షణమై, లక్ష్యంగా మారినది.

శాసన సభకు రమాకుమారి దేవి గారు కొత్త; కాని శాసనసభా-మర్యాదలు ఆమెకు సుపరిచితాలు. రాజకీయశాస్త్రం, ప్రపంచ చరిత్ర ఆమెకు మొదటినుంచి అభిమాన విషయాలు. తండ్రిగారి చారిత్రక గ్రంథాలయంలో ఆమె గడిపినకాలం అనల్పం; చదివిన గ్రంథాలు అసంఖ్యాకం.

మధ్యప్రదేశ్‌లోని రాథోడ్ కుటుంబం చరిత్రప్రసిద్ధమైనది. 'సీతామవ్‌ు' అను సార్వభౌమాధికారంగల సంస్థానాధీశ్వరునికి ఆమె మనుమరాలు; రాజ్యసభ సభ్యుడుగా పనిచేసిన డాక్టర్ రఘువీర్‌సింగ్‌కు తనయ; ఒరిస్సాలోని జేపూర్ మహారాజా విక్రమ్‌దేవ్‌కు కోడలు; విశాఖపట్నంలోని మాడుగుల శ్రీమతి రమాకుమారిదేవి నియోజకవర్గం.

ఘోషా పద్ధతి కారణంగా ఆమె ఇంట్లోనే చదువుకుని బి. ఏ. పట్టా పొందారు. బంధువులను సందర్శించడానికి 1954లో ఇంగ్లాండుకు వెళ్ళినప్పుడు, తమ తాతగారికి తెలియనివ్వకుండానే కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో కొంతకాలం చదివారు. పదేళ్లక్రితం జేపూర్ సంస్థానాధిపతి శ్రీ రామకృష్ణదేవ్‌తో ఆమె పాణిగ్రహణం జరిగింది. ఆమెకు శక్తివిక్రమ్, విభూతిభూషణ్ ఇద్దరు కుమారులు. విజయలక్ష్మి కూతురు.

రమాకుమారిగారు రాజకీయ విషయాలపై కుటుంబీకులతో జరిపే చర్చలమూ, వాటి పద్ధతులను తండ్రి గుర్తించి, గణతంత్ర పార్టీలో చేరే ప్రసాద ముందని గ్రహించి, ఆమెను కాంగ్రెస్‌పార్టీలో నాల్గేళ్ళ క్రితం చేర్పించారు. కొండల్లోని, కోనల్లోని ప్రాంతాలన్నీ ఆమె పర్యటించారు. వందలాది స్త్రీలు ఆమె సదనానికే వచ్చి, తాము పూర్తిగా బలపరుస్తామని చెప్పారు. ఎన్నికల్లో బ్రహ్మాండమైన మెజార్టీతో విజయం పొందారు.

నియోజకవర్గం పరిస్థితులను ఆమె క్షుణ్ణంగా గ్రహించారు. ఆ ప్రాంతంలో వర్షాకాలపు నీరును నిల్వచేయడం, మాడుగులనుండి దేవరపల్లివరకు రోడ్డు నిర్మించడం, సారవంతమైన భూముల్లో వాణిజ్య పంటలను అభివృద్ధిపర్చడం, కాఫీతోటలను

# మత్తుమందు-వినేశక్తి

మీ కెప్పుడయినా ఆపరేషన్ జరిగిందా? అప్పుడు మత్తుమందు (అనెస్తీసియా) ఇచ్చారా? ఇచ్చిన తర్వాత కూడ మాటలు వినిపించాయా?

ఎందరికో వినిపించవు. కొందరికి వినిపించాయంటారు. ఇందులో వింత ఏమీ లేదు!

కాని, ఆపరేషన్ చేసే డాక్టర్లు ఏవేవో విషయాలు మాట్లాడుకుంటూ ఉంటారు. ఇవి విన్న పేషంట్లు వారుతమపట్ల తగినంత శ్రద్ధ చూపించటంలేదని భ్రాంతి చెందవచ్చు!

అంతేకాక, మెదడు సరిగ్గా పని చెయ్యక పోవటంచేత ఆ మాటల అర్థాలే మారిపోవచ్చు. పూర్తి మెళకువవచ్చినప్పుడు ఇవి జ్ఞాపకం ఉండి అనవసరమయిన ఆందోళన చెందవచ్చు! అసలు డాక్టర్ల మీద నమ్మకమే పోవచ్చు.....

అందుకనే ఈ రోజుల్లో చాలా మంది సర్జన్లు ఆపరేషన్ చేసేప్పుడు



అనవసరంగా ఏదీ మాట్లాడరు.

హెచ్. ఎల్. హార్షవ్‌పాన్
(కాపీరయిటు)

# గృహమే గృహిణి మనస్సుకి ప్రతిబింబం

కొందరి ఇళ్ళలో అడుగుపెట్టగానే కళ్ళకీ, మనస్సుకీ హాయిగా వుండి చాలా సేపు కూర్చోవాలనిపిస్తుంది. కొందరి ఇళ్ళల్లో ప్రవేశించగానే ఎక్కడ కూర్చోవాలో తెలియక, గృహిణి మనకి బాట చూపే వరకూ అయోమయంగా నిలబడి దిక్కులు చూడవలసి వస్తుంది. కారణం అందరికీ తెలుసు. సోఫాల్లో పాతపేపర్లు, అట్టలు వూడిపోయిన పాత మ్యాగజీన్లు, తడి తువ్వాళ్ళు, పిల్లలు ఆడుకుని వదేసిన పాత డబ్బాలు, ఒకటేమిటి ఎన్నెన్నో సాక్షాత్కరిస్తూంటాయి.

వస్తువులన్నింటినీ వాటి వాటి స్థానాల్లో అమర్చుకోడం ఎంత అవసరమో, పనికిరానివీ, ఉపయోగంలేనివీ అయిన వస్తువులను ఏప్పటికప్పుడు డిస్పోజ్ చెయ్యడం కూడా అంతే అవసరం. కొత్త వస్తువులు కొనాలనీ, ఇంటిని అందంగా ఆధునికంగా అలంకరించాలనీ గృహిణులు ఆరాటపడుతూ వుండడం సహజం. ఇదేవిధంగా పనికిరాని సామాన్లను ఎప్పటికప్పుడు పారవేసే తెగింపు కూడా గృహిణికి ఎంతో అవసరం. కొందరికి ఏ వస్తువూ పారవేయడానికి బుద్ధిపుట్టదు. విరిగిపోయిన కుర్చీలు, తుప్పుపట్టిన డబ్బాలు, పగిలిపోయిన జాడీలు, ఆఖరికి చిరిగి పీలికలైన చీరెలైనా సరే, పారవేయలేరు...

ఈ సామాన్లన్నీ అటకల్లో, కిటికీల్లో, [illegible]మరాల్లో, ఎక్కడబడితే అక్కడ తిష్టకి వేసుకు కూర్చుని ఇంటికి అవసరమైనంత బూజునూ, ఎలుకలనూ, బల్లులనూ బద్ధింకులనూ సరఫరా చేస్తూంటాయి.

ఈ రోజుల్లో పట్టణాల్లో ఇళ్ళు దొరకడం చాలా కష్టంగా వుంది. దొరికినా, చిన్న చిన్న ఇళ్ళే తప్ప పెద్దఇళ్ళు, ఎంతో అద్దె ఇస్తేగాని దొరకవు. వందలకి వందలు అద్దె చెల్లించే స్తోమతులేనివాళ్ళు రెండు మూడు గదుల్లో, ఆఖరికి పెద్ద పెద్ద పట్టణాల్లో ఒక్క గదిలోనే—ఇమిడిపోవాల్సి వస్తోంది. ఇల్లాంటప్పుడు, ఎంతో అవసరమైన సామానుతప్ప ఇతరసామాన్లు పెట్టుకునే చోటు వుండదు. పగలు డ్రాయింగ్‌రూంగా వుండి, రాత్రికాగానే బెడ్‌రూంగా మారిపోతుంది ముందు గది. ఇంక వంటగదీ, భోజనాలగదీ, డ్రెస్సింగ్ రూం అన్నీ ఒకేగది. డ్రాయింగ్-కం-బెడ్ రూం వుండే అదే పిల్లలు చదువుకోడానికీ, ఆడుకోడానికీ, పెద్దలు మాట్లాడుకోడానికీ అన్నింటికీ. ఇటువంటి సందర్భాలలో ఫోల్డింగ్—అంటే మడిచివేయడానికి వీలైన—ఫర్నిచర్ తప్ప ఉపయోగం ఉండదు. అలాంటివే కొనాలి కూడా.

వున్న కిటికీలు మూసివేసి వాటిల్లో కూడా సామాన్లు పెడుతూంటారు. అసలే గాలీ వెలుతురూ తక్కువ. ఇంక కిటికీలు కూడా మూసివేస్తే, వేరే చెప్పనవసరం లేదు. పాతపేపర్లు కూడా కట్టలుకట్టి కిటికీల్లో, గూళ్ళల్లో వేయడంకంటే వాటిలో కావలసిన కటింగ్స్ తీసుకుని ఏనెల వా నెల అమ్మివేయడం మేలు.

పనికిరాని వస్తువులు ఎక్కువగా వుండేది వంటయింట్లోనే. తుప్పుపట్టి చిల్లులుపడ్డ డబ్బాలు, విరిగిపోయిన స్టౌలు, చిల్లిపడ్డ పాత్రసామాను, ప్రస్తుతం వుపయోగించని ఇత్తడి, రాగిపాత్రలు, ఇలా అనేకం.

కొంతమంది టూత్‌పేస్టు, బిస్కెట్లు కట్టిన ప్యాకింగ్స్, ఖాళీ అగ్గిపెట్టెలు సబ్బుపెట్టెలు కూడా ఓ బుట్టలో వేసి పెడుతూంటారు. ఈ బుట్టలతో సగం అటకలు నిండుతాయి. ఎలుకలు వృద్ధి అవుతాయి. తుప్పుపట్టి చిల్లులుపడ్డ డబ్బాలు ఎవరూ కొనరు గనుక వాటిని నిర్దాక్షిణ్యంగా డస్ట్ బిన్‌లో పారవేయవచ్చు. విరిగిపోయి బాగుచేయడానికి వీల్లేని స్టౌలూ అంతే—చిల్లిపడ్డ పాత్రసామాను మార్చి కొత్తది కొనవచ్చు. విరిగిన కప్పులు, సాసర్లు కూడా వీలుంటే క్విక్ ఫిక్స్‌తో అంటించుకుని వాడుకోవచ్చు లేకపోతే పారవేయవచ్చు.

అలాగే అరిగిపోయి, తెగిపోయిన చెప్పులు, చిరిగిన బట్టలు కూడా! ఎండాకాలంలో జోళ్ళు యిస్తే సంతోషంగా తీసుకుని వాడుకుంటారు పనివాళ్ళూ, బిచ్చగాళ్ళూ... మనం కొత్తవి కొనగానే పాత జోళ్ళను ఏ బుట్టలోకో అట్టపెట్టెలోకో వేసేసి అటకమీద వేయడం కన్న, వాటిని వెంటనే ఎవరికైనా ఇచ్చివేస్తే వాళ్ళు ఉపయోగించుకుంటారు. మనకీ వాటిని దాచే బెడద తప్పుతుంది. చిరిగిన బట్టలతో కొందరు స్టీలు గిన్నెలు కొంటారు, కొందరు పనివాళ్ళకిస్తూ వుంటారు. ఈ రెండింటిలో ఏదైనా ఫరవాలేదు గాని, వాటిని వూరికే మూటలుకట్టి బీరువాల్లోనూ, విడిచిన బట్టల పెట్టెల్లోనూ, ఎక్కడపడితే అక్కడ పడేస్తే వాటిని ఎలుకలూ చిమటలూ కొట్టడమేకాక, వాటి మూలంగా మంచి బట్టలు కూడా చెడిపోయే అవకాశం వుంది. పార్కుల్లో తోటల్లో చూడండి. ఏ సీజనులో ఆ మొక్కలునాటి పూలు పూయిస్తారు. పూత అయిపోగానే ఆ మొక్కలను పీకేసి కొత్తవి పాతుతారు. అలాగే ఇంటిని కూడా పరిశుభ్రంగా కంటికింపుగా వుంచాలంటే

---

## రాణీ రమాకుమారిదేవి

పెంచడంవంటి పెక్కు కార్యక్రమాలను కొండజాతులవారి అభ్యున్నతికై ఆమె చేపట్టి యున్నారు. తమ ప్రాంతంలో బొగ్గు గనులున్నాయని ఆమె తెలుసుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారిచే పరిశోధన జరిపించడానికి సంకల్పిస్తున్నారు.

పుస్తకాలంటే ఆమెకు అమితమైన అభిమానం. థామస్‌హార్డీ, హాప్స్ ఆమెకు అభిమానులు. మార్క్స్ వ్రాసిన గ్రంథాలూ పఠించారు. అరికపూడి రమేష్‌చౌదరి, యశ్‌పాల్ నవలలూ ఇష్టం. జేన్‌ఆస్టన్, పెరల్‌బక్ వంటి రచయిత్రుల నవలలన్నీ చదివారు. ప్రయాణాలుచేసే సందర్భంలో ఆమె డిటెక్టివ్ నవలలు చదువుతుంటారు. ఎప్పుడైనా సినిమాలు చూస్తుంటారు.

శాసనసభలో అధ్యక్షమండలిలో రమాకుమారిదేవిగారికి సభ్యత్వం ఉంది. కాంగ్రెస్ సభ్యురాలైనప్పటికీ, చర్చల్లో ఎక్కువగా పాల్గొని, ప్రజావాణిని ప్రతిధ్వనింపజేస్తూ, ఉత్తమ 'పార్లమెంటేరియన్'గా రూపొంది అన్ని వర్గాల మన్ననలను పొందడానికి ఆమె ప్రయత్నించారు. ఉన్నత విద్య, ఉత్తమ సంస్కారం—మధురమైన భాషణం ఆమె వ్యక్తిత్వానికి భూషణం.

—బాసాని సుదర్శన్ రెడ్డి ●




## హాయిని గొల్పుతూ రక్షణ యిచ్చే హెక్సక్లోరోఫీన్ కూడిన బ్లూ సీల్ టాల్క్ వాడి చూడండి!

మన దేశము ఉష్ణాధిక్యత గలది కనుక, చెమటకు సంబంధించిన సమస్య అతి కఠినమైనది. చెమట పట్టడం చర్మముపైన సూక్ష్మజీవులు కలిగించే దుర్గంధమునకు దారి తీస్తుంది □ బ్లూ సీల్ టాల్క్ జల్లుకొంటే అది చర్మాన్ని సూక్ష్మ జీవులనుంచి, చెడ్డ వాసనల నుంచి కాపాడుతుంది...దీనికి కారణం బ్లూ సీల్ టాల్క్ హెక్సక్లోరోఫీన్‌తో కూడి వుండడం. హెక్సక్లోరోఫీన్ ప్రపంచమంతటా అంగీకరింపబడిన శరీర దుర్గంధ నివారిణి □ బ్లూ సీల్ టాల్క్ రోజంతా చక్కని కొలోన్ వలె మీకు హాయిని గొలుపుతూ మీ చర్మానికి మృదుత్వం, రక్షణ యిచ్చి కాపాడుతుంది!

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

P-5591

# మనిషి

వీధిలో నడిచివెళ్ళే వారందరూ అవిచిత్ర వేషంతో ఉన్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోతున్నారు, నవ్వుకుంటున్నారు. నేలని అంటే పయివస్త్రం, గోపురంలాగ ఉన్న టోపీ, పిచ్చిగా ఉన్న అతని వాలకం అందరి గమనాన్ని ఆకర్షించింది.

అది క్రీ. శ. 1244 వ సంవత్సరం. పర్షియా దేశంలోని సెల్జుక్ రాజ్య ముఖ్య పట్టణం కోనియాలో రాజబాట. ఆ విచిత్ర వేషధారిని కొందరు పరిహాసం చెయ్యటం కూడా ప్రారంభించారు. ఇంతలో అటువయిపు మవులానా జలాల్ అల్దీన్ రుమీ తన ఉదయం ప్రార్థన నిమిత్తం మసీదుకి వెడుతూ అక్కడికి వచ్చాడు. అతని దృష్టి ఆ వ్యక్తిమీద పడింది. అక్కడివారు అప్పుడొక వింత దృశ్యాన్ని చూడగలిగారు: మహాపండితుడయిన రుమీ ఆ విచిత్ర వేషధారి దగ్గరికి వెళ్ళి ఎంతో వినయంగా వంగి ఏదో మాట్లాడటం ప్రారంభించాడు. కొంతసేపు తర్వాత అతన్ని తన ఇంటివయిపుగా తీసుకువెళ్ళిపోయాడు!

అందరి చేరాకోళాన్ని ఆకర్షించిన ఆ మనిషి ఒక 'దెర్విష్'. అతను ఎవరో మవులానా రుమీకే తెలియదు! అతని పేరు షంశాల్—దీన్ అని తర్వాత అందరికీ తెలిసింది!

అయితే, రుమీ షంశాల్—దీన్‌ల మధ్య స్నేహభావం విపరీతంగా పెరిగిపోయింది. మవులానా తన పాఠశాల ఉద్యోగానికి స్వస్తి చెప్పి [illegible] ఈ మనిషి సాంగత్యంలో గడిపేవాడు. ఇద్దరూ ఆధ్యాత్మిక విషయాల చర్చలో మునిగిపోయేవారు.

మవులానా ఈ దెర్విష్‌లో సూఫీ మతం వారందరూ వెతికే 'దివ్య ప్రియుడి'ని చూసుకున్నాడు. దీనివల్ల అతని జీవితమే మారిపోయింది.

మూడేళ్ళు గడిచాయి. ఒకనాడు దెర్విష్ హఠాత్తుగా మాయమయిపోయాడు. అతని జాడ కూడా ఎవరికీ తెలియలేదు!

జలాల్—అల్దీన్ మహమ్మద్ తండ్రి పేరు బాహా అల్దీన్ వలాద్. ఇతను మొదటి ఖలీఫ్ అబూ బక్ర్ సంతతివాడు. జలాల్—అల్దీన 1207 లో ఖోరసాన్‌లోని బాల్ఖ్ పట్నంలో జన్మించాడు. వారి వంశం చిరకాలంగా పాండిత్యానికి ప్రసిద్ధమయినది. బాహా అల్దీన్‌కి 'ఉలేమా అల్ సుల్తాన్' అనే బిరుదు కూడా వచ్చింది. సూఫీ మతంమీద అతనొక పుస్తకం రాశాడు. జలాల్ అల్దీన్ మీద దీని ప్రభావం ఇంతా అంతా కాదు. 1209 లో జరిగిన జంగిస్‌ఖాన్ దాడివల్ల తండ్రీ కొడుకులిద్దరూ బాల్ఖ్‌నుంచి కోనియాకి వెళ్ళిపోయారు.

అతని 37 వ ఏట రుమీ జీవితం కొత్త మలుపు తిరిగింది. ఉత్త పండితుడు కాస్తా సూఫీ మత ప్రచారకుడయిపోయాడు. షంశాల్‌దీన్ కోసం వెతికాడు. అతను దొరకకపోవటంతో తన 'అంతరంగిక ప్రపంచాన్వేషణ' ప్రారంభించాడు. 'మెవలెవి దెర్విషె' నాట్యం కనిపెట్టాడు. ఈ నాట్యం చేసేవారు విషాదంగా బూరాల మీద వాయించే సంగీతానికి, డప్పుల తాళానికి అనువుగా గిరగిర తిరుగుతారు. నాట్యవేళంలో రుమీ కొన్ని సూక్తులు చెప్పేవాడు. వీటిని అతని శిష్యులు రాసుకున్నారు.

(64వ పేజీ చూడండి)

---

## గృహమే గృహిణి మనస్సుకి ప్రతిబింబం

ఈకాలువంతా ఎప్పటికప్పుడు — వెంటవెంట తీసివేస్తూ వుండాలి. ఖాళీటానిక్ సీసాలు, స్నో, పౌడర్లు, తిలకం సీసాలు పౌడర్ డబ్బాలు, ఇలాంటివన్నీ కూడా అయిపోగానే తీసివేసి పాత్రలో అమ్మివేయాలి — ఎవరికైనా అవసరం వుంటే ఇవ్వాలి, లేకపోతే పారవేయాలి. అంతేగాని వాటిని కిటికీల నిండా గూళ్ళనిండా టేబిల్స్ నిండా నింపకూడదు. పాత వుత్తరాల కట్టలు కూడా అంతే—ముఖ్యమైనవి ఏరి దాచుకుని తక్కినవన్నీ చింపి పారబోయాలి కానీ వాటన్నిటినీ కొక్కేలకు గుచ్చి — చాలా కాలం నుంచి ఎప్పటెప్పటివో బూజుపట్టినవన్ని ప్రేలాడదీస్తే బావుండదు. మన ఇళ్ళల్లో ఎక్కోరకాల డబ్బాలు వస్తుంటాయి: పాలపొడి డబ్బాలు, ఓవల్టీన్ డబ్బాలు, హార్లిక్స్ సీసాలు ఇలా—ఇందులో మనకి అవసరమైనంతవరకూ వుంచుకుని తక్కినవి, కొత్తగా పెళ్ళయి సంసారం పెట్టుకుంటున్న స్నేహితులకిస్తే ఎంతో సంతోషిస్తారు; లేకపోతే అమ్మివేయవచ్చు... అంతేకాని డబ్బాలన్నీ దాచడానికి పూనుకోకూడదు. ఈ తెగింపులేని నాడు ఇల్లు అడవిలాగా, పాత వస్తువుల ప్రదర్శనశాల లాగా వుంటుందిగానీ, 'స్వర్గసీమ' లాగా వుండదు...మన మస్తిష్కంలో నుంచి అనవసరమైన ఆలోచనలూ, పనికిరాని ఊహాలూ బూజుపట్టిన భావాలనూ విరిగిపోయిన జ్ఞాపకాలనూ ఎలా విసర్జించి మెదడు శుభ్రపర్చుకుంటామో ఇంటిని కూడా అలాగే వుంచుకోవాలి. ఇంటిని చూస్తే ఇల్లాలి మనస్సు తెలిసిపోయేలా వుండాలి.

—పి. ఎస్.

---

వంటలు :

## మహల్ హోవా

| | |
|---|---|
| పిండి | ఒక కప్పు |
| పాలు (కాచినవి) | సావు కప్పు |
| పెరుగు | కావలసినంత |
| పాకం | కావలసినంత |
| బేకింగ్ సోడా (సోడా ఉప్పు) | చిన్న చెంచా |

బేకింగ్ సోడా, పిండి కలిపి జల్లించి పాలు, గట్టిముద్ద కావటానికి తగినంత పెరుగు కలిపి, సెగలు కక్కుతున్న నూనె లేక నేతిలో ముద్దలుగావేసి వేయించాలి. మాడకూడదు! తర్వాత పాకంలో నంచాలి. తినే ముందు బాగా పాకంపోసి ఉంచితే రుచిగా ఉంటాయి.



# మల్లన్నమంత్రి • మాతృభాష • కౌటిల్య

అనేక భాషలను నేర్చుకొన్న పండితుడు ఒకసారి రాజసభలోనికి వచ్చేడు. ఏ భాషనైనా సరే, అదే అతని మాతృభాష అని యితరులు అనుకొనేటంత ధారాళంగ అతను మాట్లాడగలడు. అందుచేత ఆ పండితుడు సభలోనివారికి యీవిధంగా సవాలు చేసేడు.

'సర్వభాషాకోవిదుడు' అనే బిరుదు నాకు ఉంది. మీలో యెవరైనాసరే నా మాతృభాష యేదో సకారణంగా చెప్పగలిగినట్లయితే నా బిరుదును నేను వదులుకొంటాను. అలాగున మీరు చెప్పలేక పోయినట్లయితే మీరు ఓడిపోయినట్లుగా నాకు విజయపత్రాన్ని యివ్వాలి.'

ఒక పండితుడు సంస్కృతంలో మాట్లాడేడు. మరొక పండితుడు తెలుగులో ప్రశ్నించేడు. ఇంకో పండితుడు హిందీలో పలకరించేడు. మరొక పండితుడు తమిళంలో ప్రసంగం ప్రారంభించేడు. రాజ సభలోని పండితులు యీవిధంగా ఆ భాషాపండితుణ్ని అనేక భాషల్లో పరీక్ష చేసేరు. అన్ని భాషల్లోను ఆ పండితుడు అనర్గళంగా జవాబులు యిచ్చేడు.

ఏ భాష మాట్లాడిన పండితుడు అదే అతని మాతృభాష అయివుంటుందనుకొన్నారు కాని ఆ పండితుని మాతృభాష యేదో యెవరూ నిరూపించలేకపోయేరు. అందుచేత అతనికి విజయపత్రాన్ని యివ్వవలసిన పరిస్థితి యేర్పడింది. అతని మాతృభాష యేదో తెలిసికొనవలసినదిగా అప్పుడు రాజు మల్లన్న మంత్రిని కోరేడు.

రహస్యంగా మల్లన్న మంత్రి యిచ్చిన సలహా ప్రకారం రాజు పండితుని మెడలో ఒక బంగారపు గొలుసును వేసి సత్కరించేడు. మర్నాడు మరల యీ విషయాన్ని చర్చించవచ్చునని చెప్పి రాజా సభనుంచి లేచేడు.

భాషా పండితుడు సభనుండి బయల్దేరి బజారుగుండా తన బసకు నడిచి వెడుతున్నాడు. అప్పుడు బజారులో ఒక వ్యక్తి పండితుని మెడలో ఉన్న గొలుసును తెంపుకొని పారిపోయేడు. పండితుడు అది చూసి నిర్ఘాంతపోయి 'చోర్, చోర్' అంటూ కేకలు వేయుడము ప్రారంభించేడు. అక్కడ ఉన్న ప్రజలు దొంగను పట్టుకొనడానికి ప్రయత్నించేరు కాని దొంగ దొరకలేదు.

మరునాడు సభలో మల్లన్నమంత్రి యీ విధంగా చెప్పేడు. 'నిన్నటి దినం భాషా పండితుని మెడలోని గొలుసు పోయినప్పుడు అతను 'చోర్, చోర్' అని కేకలు వేసేడు. 'చోర్' అనేది హిందీ పదం. ఆకస్మికంగా మాట్లాడవలసి వచ్చినప్పుడు సాధారణంగా ఒక వ్యక్తి తన మాతృభాషనే మాట్లాడతాడు కాబట్టి యీ పండితుని మాతృభాష హిందీ!

అప్పుడు ఆ పండితుడు కూడా తన మాతృభాష హిందీయేనని ఒప్పుకొన్నాడు. అంతకు ముందు రోజున తమ భటునిచేత దొంగిలింపచేసిన హారంతోపాటు మరికొంత ధనాన్ని కూడా యిచ్చి రాజు ఆ పండితుణ్ని సత్కరించేడు.

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

## తాబేలు—కుందేలు



(క) తాబేలు—కుందేలు:

ఒకనాడు తాబేలు, కుందేలు పరుగు పందెం వేసుకున్నాయి. 500 గజాలవ్యాసం గల గుండ్రని తోటచుట్టూ పరుగెత్తి రావాలి. తాబేలు త్వరగా పరుగెత్తలేదు కనుక మొత్తం దూరంలో 1/8 వ వంతు భాగం తాబేలు నడిచివెళ్ళేదాకా కుందేలు కదలకుండా ఉన్నచోట్లోనే కూర్చుని, అప్పుడులేచి, తాబేలు వెళ్ళినదిశకు వ్యతిరేక దిశలో తోటను చుట్టిరావడానికి బయలుదేరింది. తన పరుగుమీద తనకి ఎంతో విశ్వాసం ఉండడంచేత ఆడుతూ,




పాడుతూ, నిమ్మగడ్డి కొనలు కొరుకుతూ, తేనె పిట్టలతో ఊసులాడుతూ అలవోకగా నడువసాగింది. అంతలో తాబేలు ఎదురైంది. కుందేలు చాలా ఆశ్చర్యపడింది. 'అప్పుడే ఈ తాబేలుగాడు ఇంతదూరం నడిచి వచ్చాడా!' అని వెనుదిరిగి చూచుకుంటే 1/6 వ వంతు దూరం మాత్రమే తాను వచ్చినట్లు గ్రహించింది. వెంటనే కాళ్ళు జాడించి పరుగు లందుకుంది. మొదట్లో తాను ప్రయాణంచేసిన వేగంకన్న 20 రెట్లు వేగంతో పరుగిడితే కుందేలు పందెం నెగ్గుతుందా? లేదా?

* * *

## సోలమన్ చక్రవర్తి గోరీ



(చ) సోలమన్ చక్రవర్తి గోరీ:

సోలమన్ చక్రవర్తి గోరీ మీద ఇక్కడ చూపిన బొమ్మ చెక్కి ఉందిట



ఇందులో మొత్తం ఎన్ని త్రిభుజాలున్నాయో చెప్పగలరా?

* * *

(ఛ) రెండు అంకెలు ఉపయోగించి వ్రాయదగ్గ పూర్ణసంఖ్యలలో అన్నింటి కన్న చిన్నది ఏది? 10 అనుకుంటున్నారా? కాదు కాదు. ఆలోచించండి.

* * *

(జ) రెండు వేరువేరు అంకెలతో వ్రాయదగ్గ కనిష్ఠ పూర్ణసంఖ్య ఏది?

* * *

(ఝ) 0,1,2,3...9 ఈ పది అంకెలనూ ఒక్కొక్కసారి మాత్రమే ఉపయోగించి 1కి సమానం అయేలా వ్రాయడం ఎల్లాగ?

* * *

(ట) ఐదు 9 లు ఉపయోగించి 10కి సమానం అయేలా వ్రాయడం ఎల్లాగ?

* * *

### జవాబులు

(క) ఈ సమస్యలో గుండ్రని తోట వ్యాసంతో మనకు పనిలేదు. అది ఎంత పెద్దది అయినా మనకు ఒకటే.

కుందేలు 'మ' నుంచి 'ర' వరకూ ప్రయాణం చేసిన వ్యవధిలో తాబేలు 'య' నుంచి 'ర' వరకూ ప్రయాణం చేసింది.




'మర' = $\frac{1}{6}$ వ వంతు

'యర' = $\frac{5}{6} - \frac{1}{8} = \frac{17}{24}$ వ వంతు

కనుక,

$$\frac{\text{తాబేలు వేగము}}{\text{కుందేలు వేగము}} = \frac{17}{24} \div \frac{1}{6} = \frac{17}{4}$$

ఇంక తాబేలు ⅛ వ వంతు, కుందేలు 5/6 వ వంతు ప్రయాణం చేయవలసి ఉంది. అంటే తాబేలుకన్న 5 రెట్లు ఎక్కువ దూరం కుందేలు పరుగెత్తవలసి ఉంది. కనుక తాబేటికన్న 5 రెట్లు ఎక్కువ వేగంగా పరుగెత్తాలి. అంటే కుందేలు తాను మొదట ప్రయాణం చేసిన వేగంకన్న $5 \times \frac{17}{4} = \frac{85}{4} = 21\frac{1}{4}$ రెట్లు అధిక వేగంతో ప్రయాణం చేస్తే కుందేలు, తాబేలు ఏక సమయంలో బయలుదేరిన చోటికి వస్తాయి. కుందేలు పందెం నెగ్గ

(64 వ పేజీ చూడండి)



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు వో హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింటో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. మధు, కామయ్యమాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. తప్పించుకు తిరుగుతుంటాడు ప్రసాద్. తర్వాత అతనంటే ఆమెకు అశాంతి ఎక్కువయింది. స్కూలు హైస్కూలు కావడంతో కామయ్య మాస్టారు పదవీ విరమణ చేయాల్సివస్తుంది. మధులో ఇదివరకటి హుషారు లేదు. ప్రసాద్‌మీద అతనికి అభిమానం ఏర్పడింది. శారదకు ఇప్పుడిప్పుడు మధుమీద ధ్యాస అధికమవుతున్నది. గ్రామంలో పంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికకోసం చర్చ జరుగుతుంది.

## 17

'అరెరే-- కూర్చో ... చెప్పేది పూర్తిగా వినకముందే అంత తొందరపడితే ఎలా,'... ప్రసాద్ అన్నాడు. లేచినవ్యక్తి సణుక్కొంటూ కూర్చున్నాడు.

మాష్టారు మౌనంగా అన్నీవింటున్నాడు.

శివరామయ్య మీసాలు దువ్వుకొన్నాడు. ఆతని వర్గసభ్యుడు ఇంకా ఉపన్యసిస్తూనే ఉన్నాడు.

'ఇప్పుడు—శివరామయ్యగారి విషయమే తీసికోండి ... హైస్కూలు కట్టించటంలో గానీ... ఊళ్లో బజార్లు వేయించటంలో గానీ... అనేక విషయాల్లో ఊరికి సేవచేస్తున్నారు. ఇదెవరూ కాదనలేరు ... ఇక మిగతా వాళ్లంటారా ? చెయ్యాలనే ఉత్సాహం ఉండవచ్చు కానీ స్వంత పనులు మానుకొని శివరామయ్యగారిలా తిరగలేరని అందరికీ తెలుసు. అందుకని వారినే తిరిగి ఈ ప్రెసిడెంటు పదవికి ఎన్నుకుంటే మంచిదని నా నమ్మకం...'

'అదికాదు మావయ్యా!... మీరు ఈ ఊరికోసం ఎంతో శ్రమపడ్డారు...మీ నిస్వార్థమైనసేవ ఊళ్లో అందరికీ తెలును... ఇప్పుడు—ఈసారికి ఈ అధ్యక్షపదవి నామమాత్రంగా ఎవరికైనా అప్పగించి ఊరి బాగోగులూ యధాతథంగా మీరేచూడండి ...ఇతర్లకు కూడా మనం అవకాశం కల్పించాలిగదా?...'

అప్పటివరకూ అన్నివిషయాలూ శ్రద్ధగా వింటూ, వారికి కొద్దిగా ఎడంగా ప్రసాద్ ప్రక్కనే కూర్చున్న 'మధు' భయం భయంగా అన్నాడు.

అసనాటుగా కూర్చున్న మాష్టారు ఆ మాటలువిని సంతోషంతో పొంగిపోయి విటారుగా కూర్చున్నారు. శివరామయ్యగారు 'మధు' కేసి కోరచూపుచూశాడు.

చందమామ ఆకాశంపైకి నాల్గుబారలు ప్రాకి ఉత్సాహంగా వెలిగిపోతున్నాడు.

'అది కాదండీ...మీరు మరోలా అనుకోకుండా ఉంటే నేనొకవిషయం చెప్పదలచుకొన్నాను ... మీరు సమర్థులు — దాన్ని కాదనలేం...ఇప్పుడు మధు చెప్పినట్లు ఈ సారికి దీన్ని మరొకరికిచ్చేద్దాం...తగాదాల్లేకుండా పోతాయి'...ప్రసాద్ అన్నాడు.

'అదే నేనంటా... నేను పనులుచేపిస్తున్నానని ఒప్పుకొంటున్నారు గదా!... మళ్ళీ నేను ప్రెసిడెంటుగా ఉంటే వాళ్ళకు కడుపుబ్బర మెందుకంటా!' ... విరుచుకుపడ్డాడు శివరామయ్య—చుట్ట నోట్లోనుండి తీసి.

'ఏం...ఎందుకుండదూ? ... నీకొక్కడికే రాసిపెట్టి ఉందా? ... పొద్దుగూకులూ ... ప్రెసిడెంటు కావాలని'...అవతలమురా పోటీ అభ్యర్థి ఉవ్వెత్తున లేచిపడ్డాడు.

బాగా చీకటిపడిపోయింది ఊరు మాటుమణిగింది. విచ్చలవిడిగా తిరిగే ఆబోతు ఆ వామిలో ఆ వామిలో మేసి ఆ గుడిదగ్గరకొచ్చి నిలబడి నెమరువేయసాగింది. ఊరంతా నిద్రలో ఒళ్ళుమరచి ఉంటే వాళ్ళు తీరిగ్గా దేవుళ్ళ సమక్షంలో నానాబహాతులూ తిట్టుకొంటూ అడ్డమైన కూతలు కూసికోసాగారు.

చిలికి చిలికి గాలి వానయింది.

వాళ్లను ఏవిధంగా ఉపశమింపచెయ్యాలో తోచక మాష్టారు 'ప్రసాద్' 'మధు'లకేసి చూడసాగాడు.

'గుంటూరుపోయి ఒక్కపని చేసుకురావటం చేతగాదుగానీ ... ప్రెసిడెంట్లవుతారంట...ప్రెసిడెంట్లు. ఊళ్ళో హైస్కూలు కట్టించటానికి గానీ ఆస్పత్రి కట్టించటానికి గానీ, సొంతపనులు చెడగొట్టుకొని తిరిగింది ఎవడ్రా? ... మీరా? ... మొన్న మొన్నటివరకూ పదోతరగతికోసమని కాలికి బలపంకట్టుకొని తిరిగిందెవడురా?...మీరా? ...పనులకైతే మేమూ?...ప్రెసిడెంట్లూ—మెంబర్లూ మీరా?'...పూనకం పట్టినట్లు అదేపనిగా వాగసాగాడు. చిన్నచిన్న మురాలుగా చేరి అందరూ తలకొకవిధంగా మాట్లాడుతున్నారు.

'నీవేం ఊరక తిరిగావా? ... ఆస్పత్రి కట్టించటానికి వెయ్యిబస్తాల సిమెంటు కోటా తెప్పించి ఐదువందల బస్తాలు బయట బ్లాకులో అమ్ముకొన్నావ్...ఒక్కవారంలో ఐదుఆరువేలు కొట్టావ్...ఏందో మాకోసం చేస్తున్నట్లు నోరు పారేసుకొంటున్నావ్ '...

'ఏదీ ... ఆకూత మళ్లీకుయ్యి ... నేను సిమ్మెంటుబస్తాలమ్ముకొన్నానా! పళ్లు రాలతంతా ... నాకేమి లేకపోయి సిమ్మెంటు బస్తా లమ్ముకొంటాన్రా' ... అంటూ శివరామయ్య మీద మీదకు పోసాగాడు.

ఇద్దరు ముగ్గురు పెద్దమనుషులు అడ్డొచ్చి ప్రక్కకు తీసికొనిపోయ్యారు.

'రండ్రా...ఊళ్ళతో మనకు మాట లేనిటి. తలకు మాసిన నాయాళ్ళు... నెత్తిమీద యాగానీపెడితే దమ్మిడీకి కొరగారబ్బా ... పెద్ద మొనగాళ్ళలా బయలు దేరారు...వాళ్ళముఠాకు ప్రెసిడెంటు ఎట్టా పోతదో నేచూస్తాగా ... రండి ... నేను సిమ్మెంటుబస్తా అమ్ముకొన్నానా?...వీళ్ళకులా ఊళ్ళోకి ఎలక్ట్రిక్ తెస్తామని చందాలు వసూలుచేసి మింగి కూర్చోవట మనుకొన్నారు కాబోలు.'... ఊడిపోయిన గోచి సరిచేసు కొంటూ రొప్పుతూ మెట్లు దిగసాగాడు శివరామయ్యగారు.

ఆయన ముఠావాళ్ళు కూడ ఇవతల ప్రతిపక్ష పార్టీవాళ్ళపైన మాటలు విసురుతూ దిగిపోతున్నారు. వాళ్ళా ఏం తక్కువతిన్న రకంకాదు. ఒకమాటకూ మరోమాటకూ సంబంధంలేకుండా ఉభయ వర్గాలూ మాటలు రువ్వుకోసాగారు.

'ఎవళ్ళకు చేతనయింది వాళ్ళు చేసు కొంటారుపో ... నోరు జాగ్రత్తచేసికో ... లంజకొడుకులు — గింజకొడుకులని నోరు జారకు — మర్యాదగా ఉండదు...ఆ... నేనిప్పుడే చెబుతున్నా'...

'నీవుచేసే తల్లక్రిందులేమీ లేదుపో... ఏమిటోయువారంతేలుస్తాడంట ... మేమే అంత గాజులుతొడుక్కుని కూర్చుంది... ఆ—ఆఁ...అవన్నీ ఎనక ... ఆ పప్పులేమీ ఉడకవ్'...ప్రతిపక్ష పార్టీలో ఒకడు రొమ్ము విరుచుకొని వెళ్తూన్న ముఠానుద్దేశించి పలుకుతున్నాడు.

వెళ్తూన్నముఠా ఆగి ఆగి ప్రతిపక్షం వాళ్ళను తిడ్తూ—సవాలుచేస్తూ ఎట్టకేలకు ఆ సందుమలుపు తిరిగింది. మలుపు తిరగబొయ్యేముందు శివరామయ్య గొంతు చించుకొని... 'ఒరేయ్...మధుసూదనరావ్... రావేరా...నీకింకా అక్కడేంపని'...అరిచాడు.

'వస్తాలే...నీవుపదా!'

శివరామయ్య పిలిచినా వెళ్ళకుండ 'మధు' తనచెంత నిలబట్టంతో మాష్టారి హృదయం ఆనందంతో నిండిపోయింది.

* * *

చిటపటమంటూ రాజుకొన్న వేరుశెనగ కట్టెమంటలా ఒక అర్ధగంటలో గప్పున మండుకొని ఆరిపోయింది తగాదా. చెరువుకట్ట మీదినుండి గాలివీచి వాళ్ళ ఉద్రేకశరీరాలకు కొంత ఉపశమనం కల్గించింది.

మబ్బులు తొలగిపోయిన చందమామ తెల్లగా ప్రకాశింపసాగాడు. మసకమసక వెన్నెలపోయి పండువెన్నెల ఆ గుడి అరుగులపై పరుచుకోసాగింది. మాష్టారు మంటపం మధ్యలో చెక్కిన పద్మంపై కుదురుగా కూర్చున్నారు. వారికి ఎదురుగా కోటయ్య మునిగాళ్లపై కూర్చున్నాడు శివుని ఎదుట నందీశ్వరునిలా. మధూ...ప్రసాద్లూ— వారికి ప్రక్క ప్రక్కనే ఉన్న రాతిస్తంభాలకు ఆనుకొని కూర్చున్నారు. ఎదుటి ముఠా



# మట్టి బొమ్మలు

పలాయనం చిత్తగించటం వలన రెండవ పార్టీవాళ్ళు గొప్ప విజయం సాధించినట్లు సంబరపడిపోసాగారు.

'మనం పోరెత్తేప్పటికే...తోక ముడుచు కొన్నారు...లేకపోతే ఇంకా పెత్తనం చెలా యిద్దామనీ ... ఏం పంతులుగారూ? ... మాట్లాడరూ?' అంటూ ఆ పార్టీ నాయకుడు మాష్టార్ని పల్కరించాడు. ఆయన వెంట బిలబిలమంటూ సభ్యులందరూ మాష్టార్ని చుట్టివేశారు.

'ఏం మాట్లాడరేం?'

'మీరే అట్టా మాట్లాడితే ఎట్టాగండీ...మేము మాట్లాడిందాంట్లో ఏదైనా తప్పుంటే మీరు చెప్పుతో కొట్టండి. మేం బడతాం...కాస్త డబ్బుందనీ ... పెద్ద పెద్దోళ్ళు నా చేతుల్లో ఉన్నారుగదాని మూర్ఖత్వంగా మాట్లాడితేనే మాకు ఒళ్ళు మండేది.'

'...మీరుమాట్లాడింది నేను తప్పనటం లేదుగదా?' ... దీర్ఘంగా ఆలోచిస్తూ మాష్టారు అన్నాడు.

'అంటంలేదనుకోండి ... మాటవరసకు చెబుతున్నా...పోయిన ధఫా ఎంకట్రామయ్య బతికున్నప్పుడు ఈసారి మా రెడ్లలో ఎవరికైనా ఈ ప్రెసిడెంటు పని ఇయ్యాలని అప్పుడనుకొన్నదేవాయా!...మరీ అంత అడ్డగోలుగా మాట్లాడితే ఎట్టా సెప్పండి'...

'మిమ్మలనూ మమ్మలనూ పిచ్చోళ్ళను సేత్తన్నాడు పంతులుగారూ' మాష్టారిని వాళ్ళలో కలుపుకొంటూ ఇంకొకడు అన్నాడు.

'ఇందులో పిచ్చివాళ్ళను చేసేది మాత్రం ఏమిటిలే...ఎన్ని సంవత్సరాలుగా ఈ ప్రెసిడెంటు పదవిలో ఉంటే ఈ దాహం తీరుతుందో అర్థంకాదు.' స్వగతంగా అనుకొంటున్నట్లు మెల్లగా అన్నాడు. వెనకా ముందూ చెయ్యక తనకున్న అభిప్రాయాన్ని నల్గురెదుటా పలికాడు.

'అదిగదీ పంతులుగారూ?...మీరూ అది కనిపెట్టారు. మీరు కళ్ళ ముందుండబట్టి ముంగిలా కూసున్నాడుగానీ ... లేకపోతే ఈసారి ఆ రెడ్లకు పోవాలన్నమాటే అప్పుడు రాలేదని భోక్కరించేవాడు' ... మాష్టారు వ్యాయం వైపు మొగ్గటం గమనించి పార్టీ నాయకుడు పలికాడు.

బొగ్గులారీ ఒకటి ఆ గతుకల రోడ్డులో పడి 'గుయ్ — గుయ్'మని గింజుకొంటూ బరువుతో పక్కలకు కదుల్తూ దుమ్ములేపుకొంటూ పోసాగింది. — రెండు నిముషాలు చర్చలు ఆగాయి.

'అసలింతకూ ఎంకట్రామయ్య పోవట మొచ్చిందండీ...ఆయనుంటే ఈ మీటింగులు చెయ్యాల్సినపని లేదు ... ఈ శివరామయ్య ఇట్టా మాట్లాడేవాడూ కాదు,...ఏం అబ్బాయి—'మధూ'...బెల్లం కొట్టిన రాయిలా కూర్చుంటావ్ మాట్లాడకుండా'...

'ఏమో నాకేం తెలుసు...అప్పుడు మీరేం నిర్ణయంచేసికొన్నారో' ...

'ఎందుకు ?...నువ్వు లేకపోతేమాత్రం... ఈ పెసాదులేడా?...పంతులుగారులేడా?'...

'అయితే ఇంతకూ మీ ముఠాకు ప్రెసిడెంటు పదవి ఇవ్వాల్సిందేనంటావ్'... అంతేనా,... మధు నవ్వుతూ అతనికేసి చూశాడు.

'రామాయణమంతా విని రాముడికి సీత ఏంకావాలని అడిగినట్లుంది నీ శాత్రం— మరి లేకపోతే ఈ తగాదా ఎందుకూ ?'... అతనూ నవ్వుతూనే సమాధాన మిచ్చాడు.

'ఈలాటి వ్యవహారాల్లో మాటమీద నిలబడటమనేది ఎక్కడో నూటికి కోటికి జరుగుతుంది...అందుకనే వచ్చేసారికి ఉండేవాళ్ళెవరో ఊడేవాళ్ళెవరో 'వద్దురా' అంటే విన్నారా!'...ఒక సూక్ష్మబుద్ధి తన దూరదృష్టిని లెక్కచెయ్యనందుకు ఫలితం అనుభవిస్తున్నరన్న ధోరణిలో పలికాడు.

'ఇప్పుడు ఒప్పుకొంటే వచ్చిన నష్టమేందిరా! ... నాకు తెలియకడుగుతా! ... ఇప్పుడు మనమాట కాదని శివరామయ్యను పోటీకి నిలబడి గెలవమను—సే సూత్తా'... ముఠా నాయకుడు ఆత్మవిశ్వాసంతో ప్రకటించాడు. గుడిప్రక్క నెలపొడిచేవరకూ మిణుకుమిణుకుమన్న వీధి దీపం ఎరుపుకు తిరిగి 'భగ్గ'మని మండి ఆరిపోయింది. పంచాయతీ నౌకరువచ్చి రేడియో కట్టివేసి వెళ్ళిపొయ్యాడు.

'ఏం...మధూ ... ఈ విషయంలో నీవు మీ మామయ్యకు నచ్చచెప్పి చూడకూడదూ?...పెధవది...అందరికీ తలనొప్పి



# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఉపశమనముతో సహా రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది!

ఎత్తి లేబిలు

దగ్గు, జలుబులతో నీర్సముగా ఉండి రోగనిరోధక శక్తిని కోల్పోతారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశముంది.

వాటర్‌బరీస్ కాంపౌండులో గల ఓషధులు ఆకలిని వృద్ధి చేస్తాయి, కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి, ఇతర వ్యాధులు కలగకుండా రోగనిరోధక శక్తిని యిస్తాయి. దీనితో చేర్చబడిన 'క్రియొసోట్' మరియు 'గయొకోల్' దగ్గు, జలుబుల నుండి ఉపశమనమును కలిగిస్తాయి.




బలము మరియు ఆరోగ్యమునకు
వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి!




వార్నర్-హిందూస్తాన్ లిమిటెడ్

పోతుందో ... అప్పటివరకూ అందరి ముఖాల్లోకి చూస్తూ — చెవులు దోరపెట్టుకొని అందరిమాటలూ వింటున్న ప్రసాద్ చిన్నగా గొంతు విప్పాడు.

మాష్టారు విస్ఫారిత కళ్ళతో విప్పారిన ముఖంతో ప్రసాద్‌కేసి చూశాడు అభినందన పూర్వకంగా. అందరికీ ఆ సలహా నచ్చినట్లు సంతోషపడిపోయ్యారు.

'ఆ.. ఆ...పులికడుపున మేకపుట్టుద్దా?... ఆతండ్రికి తగ్గకొడుకు అనిపించుకోవాలి... ప్రసాదు చెప్పినట్టు నువ్వు తలుచుకొంటే ఇది చిటికెలో తేలుద్ది' ... అవతల పెద్ద మనిషి ఒకడు 'మధు'ని పొగిడాడు.

అందరూ తననొక విశిష్టవ్యక్తిగా గౌరవించి ప్రత్యేకత చూపించటం అతనికి ఆనందం కలిగించింది. కాని ఆ గొప్ప తనంతోపాటే వాళ్ళందరూ కలిసి తననెత్తిన పెడుతున్న ఆ బాధ్యతయొక్క భారాన్ని మోయగలనో లేనో అనే అనుమానంకూడ కలిగింది.

'ఆలోచిద్దాం' ... తటపటాయిస్తూ అన్నాడు.

'సరిపోయె — ఇంకెప్పుడు? ... ఇప్పటికే

# పుట్టిబొమ్మలు

నెలబొడిచి నెత్తివిగాదకొచ్చింది. కాస్త తాలితే గురకొయ్యలు మొలుత్తాయి...ఎరువు బళ్ళుతోలుకోవాలి ... 'అదంతానే జాను కొంటాలే' అని మాటిస్తే అదొక ఇదానం గాని ఆలోసిత్తానంటే ... ఎప్పుడూ? ... ఏందీ? ...' పెద్దగా ఆవులించి కోటయ్య అన్నాడు — గచ్చుమీద తువ్వాలు పరచుకొంటూ.

ఆ మాటలు మధుకు బాధ కలిగించాయి. కానీ వయస్సులో పెద్దవాడు—తన తండ్రి అనుచరులలో ముఖ్యుడైన కోటయ్య ఆ విధంగా నిర్మొహమాటంగా తననింకా చిన్న పిల్లవాడిలా భావించి మాట్లాడటంలో ఉన్న సహజత్వం అతనికి ఊరట కలిగించింది.

'మానుకోవయ్యా! ... అంటే ఆయనకు కోపం...పోనియ్యరాదుండ్రా అంటే ఈళ్లకు కోపం...ఎందుకురా? ఈ ఎలచ్చన్లు...ఎవుడి పాగలివాడు దున్నుకోక ... మెంబర్లంట ... పెసిరెంట్లంట...' పడుకొని కళ్ళుమూసుకొని కోటయ్య గొణగసాగాడు. ఎన్నికలపట్ల అతను ప్రదర్శిస్తున్న నిరసనకు అందరికీ నవ్వొచ్చింది.

'ఇప్పుడు కోటయ్య చెప్పింది కూడా నిజమే...అబ్బాయి 'మధూ'..మీ మామయ్యను ఒప్పించగలననే నమ్మకమ్ముంటేనే మాట్లాడు. లేకపోతే లేదు' నాయకు డన్నాడు. వాళ్ళు తనపై పెడుతున్న ఒత్తిడికి తికమక పోసాగాడు 'మధు'. అతను ప్రదర్శిస్తున్న అసహాయతను గ్రహించిన ప్రసాద్ వెంటనే అందుకొన్నాడు.

'మనం అలా తాడోపేడో తేల్చుమంటే 'మధు' మాత్రం ఏం చేస్తాడు.' మధు లోలోన 'హమ్మయ్య' అనుకొని గట్టిగా గాలి పీల్చుకొన్నాడు.

'కొత్త కొత్తగా మన ఊరి వ్యవహారాల్లో యిప్పుడే దిగుతున్నాడు కాబట్టి, వాళ్ళ మామయ్యకు ఎలా చెబితే నచ్చుతుందో ఆలోచించుకోనివ్వండి ... శివరామయ్యగారి సంగతి మనకు తెలియనిదేముంది...గట్టి మనిషి...నూటికి నూరుపాళ్ళు ఈ పని 'మధు' వలన అయిందే అనుకోండి...ఒక వేళ... కాలేదనుకోండి... అప్పుడేం చేయాలో ఆలోచించండి...' ప్రసాద్ వాళ్లను మళ్లీ సమస్యకు పట్టుకొచ్చాడు.

'ఆ...అదే...ఆ సంగతి తేల్చిచెప్పండి... పంతులుగారూ...ఇప్పుడు మమ్మల్నేం చెయ్యమంటారూ?...ఆయన పోటీకొస్తే మాత్రం మళ్ళీ మురాలూ - తగాదాలూ —కొట్లాటలు మాత్రం లేవక మానుకోవ్...'

'అది కాదు వెంకటరెడ్డిగారూ?... మాష్టారినడిగితే వారు మాత్రం ఏం చెబుతారూ'...ప్రసాద్ అందుకొన్నాడు. అప్పటి వరకూ బుద్ధవిగ్రహంలా కూర్చున్న మాష్టారిలో కొద్దిగా కదలిక మొదలైంది. కాళ్ళు మార్చుకొని కూర్చుని ప్రసాద్‌కేసి చూడసాగాడు.

'అసలు సమస్యంతా సీటు ముడి పడి కూర్చుంది శివరామయ్య దగ్గరయితే... 'మధు'తో పాటే మాష్టారుకూడ నచ్చచెప్పి చూస్తారు. అంతగా వినకపోతే సరేసరి... మా అప్పటి వ్యవహారం అప్పుడు చూసికోవచ్చు...ఇక పోదాం పదండి'...లేవటానికుద్యుక్తుడయ్యాడు ప్రసాద్.

ప్రసాద్ సూచన మాష్టారికి బాగా నచ్చింది. కానీ శివరామయ్యగారిని మార్చగలననే నమ్మకం మాత్రం కుదరటంలేదు. బోగడ తన సమక్షంలోనే ఈసారి ప్రెసి



డెంటు పదవి ఈ మురాకిచ్చాలని నిర్ణయం జరిగింది. అయితే అలాటిదేమీ జరగనట్లు, నిజాయితీ లేకుండ ప్రవర్తిస్తూన్న వ్యక్తితో తాను పోట్లాడటం—ఒప్పించటం అసంభవ మనిపించింది.

'నేను పోట్లాడను. ఆ బాధ్యతంతా మీదే...మధూ' అన్నాడు.

'అయితే పంతులుగారూ...మీరు తప్పుకొంటున్నారన్నమాట.'

మాష్టారు అవమానంగా బాధ పడ్డాడు. తన నొక అవకాశవాదిగా ఎదుట వ్యక్తి అభిప్రాయపడుతున్నాడని మనసు ఉద్రేకపడ సాగింది.

'ఆయనతో మాట్లాడనప్పుంత మాత్రాన తప్పుకొంటున్నట్లెందు కనుకొంటున్నారు.. నేనుండగనే అందర్నీ వ్యతిరేకించి పోయిన వాడు రేపు నేను ప్రత్యేకంగా మాట్లాడితే మాత్రం నా మాట వింటాడనే నమ్మకం నాకు లేదు'...ఆయన ఛాతి ఎత్తుగా ఉబ్బి దిగిపోయింది.

'తప్పుకొంటున్నారంటే...నా అర్థం అది కాదు పంతులుగారూ!...మీ నీతి నిజాయితీల్లో నాకు బాగా నమ్మకముంది...ముండ టేడు నా మనమడ్ని 'ప్యాస్' చెయ్యమంటే నవీమిరా చెయ్యమన్నారు...మీ రెంతవరకూ నిజాయితీపరులో చూద్దామనుకొన్నాం... మీ సొంత కూతుర్ని కూడ తప్పించటానికి మీరు వెనకా ముందూ చెయ్యలేదు. మీరు ఖచ్చితమైనవాళ్లని మాకు తెలుసు...మీరు శివరామయ్య కల్సి మొగ్గుతున్నారని నే ననటంలేదు...మీరూ వెంకట్రామయ్యగారూ అప్పుడు మాకు నచ్చచెప్పినట్లే... ఇప్పుడు వాళ్ళకు నచ్చచెప్పండి...కొద్దిగా శరద తీసుకోమని చెబుతున్నా...అంతే'... వెంకటరెడ్డి పలికాడు—సంజాయిషీ ధోరణిలో.

'ఆలోచిద్దాం...ఇంకా వారం రోజులు 'టైమ్'ముందిగా ... నామినేషన్లు పంపటానికి'...

'మీరు ఆ మాత్రం హామీ ఇస్తే మాకిక భయంలేదు పంతులుగారూ ... మాకు అన్యాయం జరగదు...ఆ శివరామయ్య కొచ్చే వోట్లు - ఆ తెలగలవార్లు ఒకటే—పోతే కోమట్లవార్లు అంతే...బాపనోళ్ల నెంబరు ఆ కిట్టమూర్తి అటువాడే...మొత్తం తిప్పి తిప్పి కొడితే నాల్గు వోట్లు...అతనిదానితో కలుపుకొని...ఇక మా సంగతంటారా?... మీకు తెలిసిందేగా?...మావి రెండువార్డులు ...ఆ సాయిబులవార్లు మనదే...ఇక వివా

## మట్టి బొమ్మలు

పడమటి వీధి సాలీలవాళ్లు...' అంటూ ఓ క్షణం ఆగిపోయి—'మనది కాదు గానీ లటు మాత్రం పోదు...అందుకు సచ్చులేదు... అయితే మనంపోయి ఆ మెంబరుతో మాట్లాడాలి—' ప్రతిపక్షపార్టీ నాయకుడు ఊళ్లో ఉన్న వార్డులూ, మెంబర్లని గూర్చి ఏకరువు పెట్టసాగాడు.

'సరే...ఇదంతా ఇప్పుడెందుకు వెంకట్రెడ్డి గారూ ? అంత తొందరపడకండి...రేపు 'మధు'ని మాట్లాడనివ్వండి'...

'ఇంకా మీకు ఆశ ఉందండిరా పంతులు గారూ?...నే చెబుతున్నా చూడండి...ఆ శివరామయ్య అబ్బాయి మాట వింటాడా ? ...వింటే నా చెవు కోయించుకొంటా... అదంత తేలిగ్గా వినే గటం కాదు' ఒక పెద్ద మనిషి వత్తాసు పలికాడు.

'సరే లెండి...వింటే సరే సరి...వినక పోతే మేం జెప్పేన్నది... ఇప్పుడు ఆ చాకలోళ్లది ఒకటి...మాలా మాదిగలివి రెండూ ...మొత్తం మూడు వార్డులూ మీరు ఎట్టా సెబితే అట్టా ఇనేవే...అందుకని పంతులుగారూ ! ఆ మెంబర్ల వోట్లు ఇక మీ సేతిలో పని...మీరు 'ఊఁ' అనండి —చాలు'...వారి నాయకుడు అన్నాడు.

వాళ్ల మొండి పట్టుదలకు మాస్టారికి కోపం—నవ్వూ రెండూ కలిగాయి.

'సరేలే...చూద్దాం..దీనికి పెద్దరాద్ధాంత మెందుకు...కోటయ్యను లేపండి... అప్పుడే గుర్రు పెడుతున్నాడు'... పంతులుగారితో పాటు అందరూ ఇళ్ల కెళ్లటానికి సిద్ధమయ్యారు.

కోటయ్య తుళ్లిపడి లేచాడు...పెద్దగా ఆవులించి తువ్వాలు విదిలించుకొని పంతులు గారి ననుసరించాడు. మెట్లు దిగారు.

ఆబోతు అచంచలంగా దారికడ్డంగా నిలబడింది. దీపస్తంభం ప్రక్కనే గజ్జి కుక్క ఒకటి వెనక కాలితో చెవులు కొట్టుకొంటోంది.

కొమ్ము విసిరిన ఆబోతుకు ప్రక్కగా తొలగి మాస్టారు దారితీశారు. అందరూ వారి వెనక వినయంగా నడవసాగారు. నిద్రతో ఊగిసలాడుతూన్న ఆ ఊరి ప్రశాంతతను భంగపరుస్తూ పెద్ద పెద్దగా మాట్లాడుకొంటూ చెరువుకట్టవరకూ నడిచి ఎటు వాళ్లు అటు చీలిపోయ్యారు.

(ఇంకా వుంది)

# వంశపారంపర్యం యెంతవరకు వ్యక్తి బుద్ధికుశలతకు దోహదం చేస్తుంది?

వంశపారంపర్యం పరిసర పరిస్థితులు వ్యక్తి జీవిత పరివృద్ధికి దోహదప్రాయంగా ఉంటాయి. ఈ సమస్యను వివిధకోణాల్లోంచి పరిశీలించి దాని సాపేక్షిక ప్రాముఖ్యాన్ని గుర్తించే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

కాని ఈ రెంటి సంబంధంవల్ల యేర్పడే వ్యక్తిత్వవైవిధ్యాన్ని తెలుసుకోవడం కొంతవరకు కష్టమే. దీనికోసం కావలసినన్ని పరిశోధనలు జరిపారు. చాలావరకీపరిశోధనల కవల పిల్లలను, పెంపుడుపిల్లలను వుపయోగించారు. ఇలాంటి పరిశోధనల్లో ప్రజ్ఞాభేదాల్ని గూర్చి యెక్కువగా పరిశీలించారు. ఇక్కడ కవలపిల్లల్లో రెండురకాలుండు చెప్పాలి. రూపభేదం కాని లింగభేదంకాని లేని కవలపిల్లల్ని అయిడెంటికల్ ట్విన్స్ అంటారు. అంతగా పోలికల్లేనివారిని ఫ్రెటర్నల్ ట్విన్స్ అంటారు. మొదటి రకానికిచెందిన కవలపిల్లలు ఏక అండ సంభూతులు. కాబట్టి వీరికి వంశపారంపర్య లక్షణాల్లో సామ్యత యెక్కువగా వుంటుంది

ఒకేచోట పెరిగిన కవలపిల్లల్లో ప్రజ్ఞాభేదం యెక్కువగా వుండదు. యెందుకంటే వీరికి చాలవరకు వంశపారంపర్యము పరిసర ప్రాబల్యము వొక్కటిగానే వుంటాయి దీనికి సంబంధించిన వొక పరిశోధనలో Identical కవలపిల్లల ప్రజ్ఞలో 100 కి 90 శాతం సామ్యం కనిపిస్తుంది. ఒకేచోట పెరిగిన రెండవ రకపు కవలల్లో (Fraternal twins) 100 కి 60 శాతమే సామ్యం కనిపిస్తుంది. మరో పరిశోధనలో తలిదండ్రులకు వారి పెంపుడు బిడ్డలకు ప్రజ్ఞలో 100 కి 20 శాతమే సామ్యం కనుగొనబడింది. కాని వారికి వారి సొంత బిడ్డలకు దాదాపు 60 శాతం సామ్యం కనిపిస్తుంది.

మరోపరిశోధనలో ఒకేచోట పెరిగిన (identical) కవలలకి, వేరువేరుగా పెరిగిన యీరకపు కవలకి బుద్ధి, సూక్ష్మతల్లో సామ్యం పరిశీలించారు. ఒకేచోట పెరిగిన వాళ్లలో సామ్యం వేరువేరుగా పెరిగిన వాళ్లలో కంటే యెక్కువగా కనిపిస్తుంది. కాని ఈ విధంగా కవలల ప్రజ్ఞలో భేదము సాధారణంగా అప్పచెల్లెళ్లల్లో కన్పించే భేదం కంటే తక్కువగానే వుంటుంది.

దీనిని గురించి నిర్ధారించేదుకు జంతువు లనుపయోగించి పరిశోధనలు సాగించారు. Tryon అనే మన శాస్త్రజ్ఞుని పరిశోధన అందులో ముఖ్యమైంది. 142 తెల్ల యెలుకలతో వారి పరిశోధన ప్రారంభమైంది. ఒక్కొక్క ఎలుక, Maze (వ్యూహము) అనే పరికరంలో పందొమ్మిసార్లు మొదటి నుంచి కొసవరకు పంపబడింది. ఈ పరిశోధనలో ఒక్కొక్క ఎలుక ఎన్ని తప్పులు చేసింది గుర్తించారు. అందులో తక్కువ పక్షం ఏడు తప్పులను ఎక్కువ పక్షం 214 తప్పులను చేసిన ఎలుకలున్నాయి. తక్కువగా తప్పులు చేసిన ఎలుకలకి కొంచెం బుద్ధి యెక్కువని నిర్ణయించారు, అలాగే ఎక్కువ తప్పులు చేసిన వాటికి బుద్ధి తక్కువ అని నిర్ణయించడం జరిగింది ఈ విధంగా బుద్ధితక్కువైనవి, బుద్ధికలవి అని ఎలుకల్ని రెండు ఒట్టులుగా వేరు జేసారు. ఈ రెండు ఒకే విధమైన పరిసరాల్లో వేరువేరుగా పెంచారు. ఇలాగు ఏడు తరాలదాకా వేరువేరుగా పెంచారు. తర్వాత యెక్కువ బుద్ధికల వంశంలో బుట్టిన ఎలుకల్ని Maze మూలంగా పరిశోధించినప్పుడవి సగటున 20తప్పులే చేసినాయి. బుద్ధితక్కువైన వంశానికి చెందిన ఎలుకలు సగటున 120 తప్పులు చేసినాయి. Tryon యీ విధంగా 18 తరాలవరకు ఎలుకల్ని పెంచి చూశాడు. కాని ఏడు తరములకు తర్వాత బుద్ధి పెరుగుదల్లో మార్పు కన్పించలేదు. బహుశా ప్రకృతి పరిధి అంతేనేమో.

దీని తర్వాత Tryon ఈ రెండు జట్లని కలిపి ఒకటిగా పెంచి చూచాడు. కొన్ని తరాల్లోనే ఎలుకల మొదటిస్థితి దిగజారిపోయింది. అంటే పరిశోధన ప్రారంభంలోనే యీ ఎలుకలు సగటున 54 తప్పులు చేయడం జరిగింది. కాబట్టి వ్యక్తిత్వ భేదాలకి వంశ పారంపర్యము, పరిసర పరిస్థితుల సంయోగము కారణమైనా, బుద్ధి కౌశల్యానికి పరిసర ప్రాబల్యంకంటే వంశ పారంపర్యానికి ఎక్కువ ప్రాధాన్యం వుందనే నిర్ణయించవచ్చు.

—వి. నటరాజన్.



# తోసుకు వచ్చిన ముహూర్తం



ఇల్లిందల సరస్వతీదేవి

హేమలత కళ్ళు తెరచి చుట్టూ కలయ చూసింది. తన క్వార్టర్సులో మధ్యగదిలో మంచంమీదనేనా ఉన్నది? ఆ సంగతి ఖాయ పరచుకోవటానికి ఆమెకు అరగంటకు పైగా పట్టింది. ఒళ్ళంతా చెమట పట్టింది. లేస్తే కళ్ళు తిరుగుతున్నాయి. లేవపోయి మంచంమీద వాలిపోయింది.

ఆమెకు ఉదయము హాస్పిటల్లో రౌండ్సు చేస్తుండగా తల తిరిగినట్లు జ్ఞాపకం. అంతే. తరువాత ఏం జరిగింది?

కళ్ళు మూతలుపడ్డాయి. పనిమనిషిని కేకలేసే శక్తిలేక నేలదగ్గరగా బల్లమీద ఉన్న గంట నొక్కింది. కాఫీ కావాలని చేతి సైగచేసి తెప్పించుకుని తాగింది. తలనొప్పి తగ్గలేదు. కణతలు పగిలిపోతున్నాయి. కణతలను నొక్కుకుంటూ కళ్ళుమూసుకు పడుకుంది. ఒక గంటయినా కాలేదు కాని యుగాలు గడిచినట్లుగా ఉంది ఆమెకు.

ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. 'మాత్ర వేసుకుని కళ్ళుమూసుకు పడుకో' అని రోగులను మందలిస్తే వాళ్ళు పడుకోలేరూ? తనలా పడుకోలేదేం? ఆమెకు నవ్వువచ్చింది. తను డాక్టరుగా వాళ్ళను దబాయించి ఒక్కొక్క మంచాన్నే దాటవేసుకుంటూ తనలో తాను నవ్వుకునేది. వాళ్ళు 'రోగులు పాపం రోగులు' మనసులోనే గొణుక్కున్నది.

పక్కమీద దొర్లిదొర్లి ఒత్తిగిలి పడుకున్నది. దిండ్లు సర్దుకున్నది. శాలువ కప్పుకున్నది. అయినా పక్క కుదిరినట్లుగాలేదు. తలా ఒళ్ళూ నొప్పులు. సూదులు పెట్టి — కాదు దబ్బనాలు పెట్టి పొడిచినట్లుగా ఒకటే బాధ. డాక్టరయిన తరువాత ఏస్ప్రో వేసుకుంటే పోయిన నొప్పులే కాని ఇంతవరకూ పడకపెట్టలేదు. ఇలాంటి బాధ ఇంతవరకూ రాలేదు.

తల్లకింద రెండుచేతులూ పెట్టుకొని కప్పువైపు కళ్ళార్పకుండా చూస్తూ ఆలోచనా సముద్రంలో మునిగిపోయింది. సుమతి తలుపు తోసుకుని లోపలికి రావటంతో ఆమె ఆలోచనకు అంతరాయం కలిగింది.

'ఏమిటే వాలకం? అలా పడుకున్నావేం? ముఖం చూస్తే పది లంఘణాలు చేసినట్లున్నావు?'

సుమతిని చూడగానే హేమలత ప్రాణాలు లేచివచ్చినట్లయింది. నవ్వుతూ పడక్కుర్చీలో కూర్చుని కబుర్లుచెప్పింది. బాధ కూడా కొంచెం కొంచెంగా తగ్గుతున్నట్లుగా ఉంది. తలలోనుంచి బరువు దిగిపోతున్నట్లయింది.

'వెంకటచలం వస్తాడా సెలవుల్లో?'

హేమలత గుండె గతుక్కుమన్నది. ముఖం అతలోకి ముడుచుపోయింది. 'నాకు తెలియదు' చటుక్కున విసురుగా అన్నది. సుమతి ఆశ్చర్యపడ్డదామాటకు. కాని

పైకి కనబడకుండా జాగ్రత్తగా సర్దుకుంటూ' వస్తానని నాకు తెలౌదులే. అందుకని అడిగాను' అన్నది.

'వస్తే ఏమవచ్చు సుమతీ. దానికేముంది? పినతల్లి కూతురు ఉంటే చూడాలని పించదా ఎవరికయినా ?'

'అదేమిటి? కొత్తగా మాట్లాడుతున్నావు హేమా! ఇంతకాలమూ పినతల్లి కూతురుకోసమేనా పెలవుపెట్టి వస్తూ ఉండేవాదు ?'

'ఇంక అంతే!' హేమలత ముఖము అవతలికి తిప్పుకుంది.

సుమతి పైట చెంగు చాటుచేసుకుని నవ్వుకుంది. ఇది రెండవ పర్యాయము ఇలా జరగటము. రెండేళ్ళ క్రిందట డాక్టరు వెంకటచెలానికీ హేమలతకూ పెళ్లి అవుతుందని అంతా అనుకున్నారు. కాని అంత వరకూ రాలేదు. వెంకటచెలము ఇల్లూ వాకిలీ ఏర్పరచుకొని కావలసిన ఫర్నిచరంతాకొన్నాడు. పెళ్ళి ఏర్పాట్లను గురించి మాట్లాడటానికి వచ్చినవాడు ఇంకెవరినీ కలవకుండానే తెల్లవారురూమున బయలుదేరే రైలు ఎక్కి వెళ్లిపోయాడు. ఇప్పుడూ అంతే కాబోలు.

'అబ్బ! నీవెంత పెంకిదానివి హేమా? నీమనసులో ఏముందో ఎవరూ కనుక్కోలేరు' సుమతి ఎంతో గట్టిగా మందలించా లనుకుంటే నాలుక తడబడ్డటయింది.

హేమలత పెదవుల మీద చిరునవ్వు మెరుపులా మెరిసి మాయమయింది. 'సరే గాని సుమతీ! నిన్ను చూడగానే నా తల నొప్పీ ఒళ్లునొప్పులూ ఎట్లా మాయ మయ్యాయో చూశావా? రాత్రంతా ఇలా కబుర్లు చెబుతూ ఇక్కడే ఉండి పోకూడదూ?' మంచమ్మీది నుంచి లేచి సుమతి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ ఆప్యాయంగా నొక్కింది హేమ.

'నన్ను చూడగానే నీకు నిజంగా బాధ తగ్గిందంటే ఇక్కడే ఉండి పోవాలని ఉంది. కాని ఇంట్లో పిల్లలనెవరు చూస్తారు? రేపు మళ్లీ వస్తాగా!'

'అయితే వెళ్తానంటావా?' చిన్న పిల్లలా గునిసింది.

'మా యింటికి రారాదూ ఈ పూటకు? తగ్గగానే వచ్చేద్దుగాని'

'ఈ కాస్తకూ ఇల్లు బయలుదేరి తే అంతా నవ్వరూ?' సుమతి నవ్వుతుంటే హేమలత కూడా నవ్వేసింది.

సుమతి వెళ్లగానే మళ్లీ ఒంటరిదయి పోయింది. తలలో ఏదోబాధ మళ్ళీ బయలు దేరింది. దబ్బనాలతో పొడిచినట్టు— కాదు గునపాలతో పొడిచినట్లుగా ఉంది ఈసారి.

నిద్ర రావటానికి ఒక మాత్ర సీసాలో నుంచి తీసి వేసుకున్నది. బొమ్మలుచూస్తూ కాగితాలు తిప్పింది. లేచి గ్లాసెడు మంచి నీళ్లు తాగింది. కాళ్లక్రింద దిండు ఎత్తుగా పెట్టుకున్నది. పక్కగా ఒక దిండు చేతి కిందగా పెట్టుకున్నది. ఎత్తు ఎక్కువయిం దని మళ్లీ సర్దుకున్నది. మగతగా కళ్లు మూతలుపడుతున్నాయి. మధ్యమధ్య చురుక్కు మన్నట్టుగా బాధ. ఇలాటి బాధ తన జన్మలో ఎప్పుడయినా వచ్చిందా? ఏమో? ఏమో... కళ్లు మూతలు పడ్డాయి.

ఆవలిస్తూ బద్ధకంగా కళ్లు తెరిచి చూస్తే చిన్నముల్లు ఏడుమీాద ఉన్నది. ఇది సాయంత్రమా? ఉదయమా? తూలుతూ వరండాలోకివచ్చి చూసింది. హాస్పిటల్లో దీపాలు— ఆవరణమంతా దీపాలు. మినుకు మినుకుమంటూ ఊరినిండా దీపాలు కన బడ్డాయి.

నౌకరు తెచ్చియిచ్చిన పాలుతాగి ఒక స్లయిసు బ్రెడ్ తిన్నది.

తనకిలా సుస్తీ ఎప్పుడయినా చేసిందా ? ఉద్యోగంచేస్తున్న ఈ నాలుగేళ్లలో ఎప్పుడూ ఇంతబాధ కలుగలేదు. మెడికల్ కోర్సు చదువుతుండగా వచ్చిన జ్ఞాపకంలేదు. కాని ఇంతకంటె పదిరెట్లుగా ఇంటరు చదువుతూ హాస్టల్లో ఉన్నప్పుడు వచ్చింది. గదిలో మంచమ్మీద ఒళ్లుతెలియకుండా పడుకుని మూలుగుతూఉంటే వార్డెను హాస్పిటల్లో చేర్పించింది. అది టైఫాయిడ్ అయింది.

జ్వరందేమిటి ? డాక్టర్లు మందులు రాయటం, వేళచొప్పున నర్సులు ఆమందులు మింగించటం అంతా ఇరవైలయిదురోజులు అక్కడ ఉండటం పెద్దబాధ అనిపించలేదు. మొదట్లో నాలుగురోజులు బాధపడ్డమాట నిజము. పలకరించే దిక్కులేక, అలా మంచ మ్మీద పడుకుని, సాయంత్రము కాగానే కిలకిల్లాడుతూవచ్చే తమవాళ్లతో బాధలన్నీ మరచి మాట్లాడే రోగులను చూస్తూ ఉండేది.

జ్వరం తగ్గిపోయింది. హాస్టలుకు వెళ్ల వచ్చునన్నారు డాక్టర్లు. ఆలోచిస్తూ పడు కుంది. మళ్లీ హాస్టలుకు వెళ్లాలి. ఉక్కు మనిషిలాంటి వార్డెనుచేతిలో మెలగాలి.

హేమలత మంచమ్మీదనుంచి లేని నిద్ర పాటి జడను ఒయ్యారంగా ఆడిస్తూ తన కంటె ఎత్తుగాఉన్న కిటికీదగ్గర నిలబడ్డది. విశాలమయిన ఆవరణంలో గుబుర్లుఉన్న తురాయిచెట్లు పాదం ముటిగేటంతవరకూ పూలురాల్చాయి. చెట్టుకింధంతా ఎర్రటి కుంకుమ రాసులురాసులుగా పోసినట్లుంది. రెండో అంతస్తు పైనుంచిచూస్తే చెట్టుకు ఒక్క ఆకయినా కనబడదు. అన్నీపూలు. ఆ ఎరుపులోనుంచి తెల్లటిచీరె కట్టుకుని కుసుమ గేటుదాటి మెల్లగా లోపలికి వస్తున్నది. ఆమె ముఖం మంచుకు వికసించిన మల్లెమొగ్గలా ఉన్నది. మనిషి సన్నగా ఉన్నా నిండుగాఉన్నది. కుసుమను చూడగానే ఎదురుగావెళ్లి భుజాలమీాద చేతులువేసి తీసుకువచ్చి కుర్చీమీద కూర్చోబెట్టు కుంది.

'ఈ ఇరవైఅయిదు రోజులనుంచీ నీవు ఇక్కడున్నట్లు నాకు తెలియదు సుమా. నీవు కనబడకపోతే రెండు మూడుసార్లు నీ క్లాసుమేట్స్‌ను అడిగాను కూడాను. ఎవరూ సరిగా జవాబే చెప్పలేదు. నిన్న హాస్టలుకువెళ్లి మీ వార్డెను నడిగాను. తెలిసినప్పటినుంచీ నీవేలా ఉన్నావోనని బాధ పడిపోతున్నాను. ఈ రొట్టె తిను' ఆప్యా యంగా చేతిలోపెట్టింది.

'నర్సులు యిచ్చిన పాలుతాగి బ్రెడ్ తిన్నాను. ఇంకేం కావాలి?'

'హేమా! యిన్నాళ్లనుంచీ ఒక్కదానవూ యిక్కడ ఎంత బాధపడ్డావ్. నేను ఊహించు కున్నాను. నాకు యిన్నాళ్లనుంచీ తెలియు లేదని కాని తెలిస్తే ఎలావచ్చేదానో? అన్న య్యకు ఒళ్లు బాగాలేదు. అమ్మ ఒక్కతే! బజారు పనులన్నీ నేనే చెయ్యాల్సివచ్చింది.'

హేమలత కళ్లల్లో అప్పటికే నిండా నీరు కమ్మింది.

'నేను తెచ్చిన బ్రెడ్ తినవూ? నీవేమీా తినలేదని తెచ్చాననుకున్నావా? తిన్నావులే. ఇదికూడా తినాలని తెచ్చాను. నీకు జ్వరం తగ్గిందిగా. ఇంటికి రావటానికే మభ్యం తరం?' భుజమ్మీద చెయ్యేసింది.

'డాక్టర్లు వెళ్లమన్నారు. రేపు వెళ్లి పోతాను' దిగులుగా ముఖంపెట్టి ఒక

# తోసుకువచ్చిన ముహూర్తం

పక్కకు తిప్పుకుంది.

'డిస్చార్జి చెయ్యగానే హాస్టలుకు వెళ్ళి పోవాలా? కాస్త బలంవచ్చి బాగా తిరగగలిగే టంతవరకూ మా యింట్లో వచ్చి ఉండు. ఇంతలోకి అరిగిపోవులే. పథ్యం బాగా వంట బట్టిన తరువాత నేను వచ్చి దింపుతాను సరేనా?'

'జ్వరమంటే తగ్గిపోయింది. పథ్యం హాస్టల్లో పెడతారులే. ఈ కాస్త దానికి మీ యింటికి ఎందుకూ?' జడ కొసలను అరచేతి మీద కొట్టుకుంటూ ఓర కంటితో కుసుమ ఏమంటుందోనని చూసింది,

'అదికాదు హేమా. పథ్యమంటే మీ హాస్టల్లో పెట్టేదికాదు. ఇంటివాళ్ళెవరయినా జాగ్రత్తగా చేసి ఆప్యాయంగా తిని పించాలి.'

హేమలతకు ఆ క్రిందటిరోజు నాలుగవ నెంబరు గదిలో చూసిన దృశ్యం మళ్ళీ కళ్ళ ముందర కనబడినట్లయింది. ఒకనాడు ఆ అమ్మాయి పాలుతాగనని మారాము చేసిందట. అన్నం పెట్టమని గొడవ చేసిందట. తను చూసినప్పుడు పాత చింతకాయ పచ్చడి, పొట్ల కాయకూర అన్నములో కలిపి ముద్దలు చేసి చేతిలో పెడుతున్నది తల్లి. ఆ పచ్చడీ కూరా నోటికి ఎంత మంచివో, వాటి రుచులు ఎంత బాగుంటాయో ఊరించి ఊరించి చెబుతున్నది. ఆ దృశ్యము తల పుకురాగానే హేమలతకు కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

'ఏమిటీ ఆలోచిస్తున్నావు హేమా? మా యింటికి రాకూడదా? నీవు రానన్నా రెక్క పుచ్చుకుని లాక్కెళ్ళతాను ఏమనుకుంటున్నావో?' కుసుమ కనుబొమలు పైకెత్తి బెదిరించింది.

హేమలత ఓపికలేకపోయినా కడుపు గట్టిగా పట్టుకుని శుష్కించిన చెంపలు గుంటలు పడేలా నవ్వింది.

'నీకెందుకూ ఈ శ్రమ అని చూస్తున్నాను కుసుమా' ఆ మాటలో ఎంత మొహమాటము మూట కట్టినట్లుగా ఉన్నదో కుసుమ అంచనా వేసుకున్నది.

మరునాడు కుసుమవచ్చి హేమలతను వాళ్ళయింటికి తీసుకువెళ్ళింది. కుసుమ తన గదిలోనే హేమలతకు మంచము వేసింది వేడి వేడి నీళ్ళ స్నానము చెయ్యగానే అలసటవచ్చి హేమలత కళ్ళుమూసుకుని పడుకున్నది.

'ఇక్కడికే అన్నీ తెచ్చానమ్మా. మెల్లగా లేచి ఈ పీటమీద కూర్చుంటావా?'

హేమలత కళ్ళుతెరిచి గడియారము చూసుకున్నది, పదకొండుగంటలు.

'అమ్మాయీ! నీవు మొహమాటపడకు. అన్నరసం కడుపులో పడితేనేగాని నీకా దడ తగ్గదు. చారన్నంతిని నోటికి రుచిగా ఉందో లేదో చెప్పు. ఇన్నాళ్ళనుంచీ నాలుక చవి చచ్చిపోయిందామెకు. అందుకే కాస్త పుల్ల పుల్లగా ఉండాలని చారుచేశాను. పాలన్నంలోకి ఈ నిమ్మకాయముక్క నంచుకో.' కుసుమ తల్లి హేమలతకు ఎదురుగా పీటవేసుక్కూచుంది.

హేమలత ఉక్కిరిబిక్కిరయిపోయింది. తన కెన్నడూ అనుభవములేని ఆదరమూ ప్రేమా కుసుమ తల్లి చూపిస్తుంటే హేమలతకు ఏమనటానికి తోచటంలేదు. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

'ఆ కాస్త అన్నం కలపవమ్మా'

కళ్ళనీళ్ళు చెంపలమీదుగా జారటంచేత ఆమె చూడకుండా ఉండాలని హేమలత ముఖం ప్రక్కకు తిప్పుకున్నది.

'పిచ్చిపిల్లా. ఎందుకు కన్నీళ్ళు? రేపీ పాటికి శుభ్రంగా తిరుగుతావు. మంచి టానిక్కు తీసుకుంటే బాగా బలంవస్తుంది. వచ్చేవారానికల్లా వెనకటి హేమలతకు మించి పోతావు.'

'అందుక్కాదండీ' కన్నీళ్ళు తుడుచుకుని నవ్వటానికి ప్రయత్నించింది.

'చూడు అన్నం తినగానే పడుకోకూడదు. నాతో పేకాటయినా ఆడు. అది యిష్టం లేకపోతే గవ్వలాటయినా ఆడు. అన్నం అరిగిన తరువాత నీ యిష్టంవచ్చినంతసేపు నిద్రపో. ఏం?' ఆమె ముఖం మూతినొసలు చిన్న పిల్లలతో మాట్లాడేప్పుడు ఉన్నట్లుగా ఉన్నాయి.

'మా అమ్మ చెప్పినట్లు వినకపోతే ఊరుకోరు హేమా. ఆవిడ మా పెద్దమనిషి. ఆమెమాట వింటేనే మనకు సుఖమనుకో. సాధింపులు ఉండవు' కుసుమ హేమలత పక్కన కూర్చున్నది భుజంమీద చెయ్యి వేస్తూ.

కుసుమ యింట్లో వారంరోజులు నిమిషాల్లా గడిచిపోయాయి. ఆమె తల్లి మణెమ్మ హేమలతకు ఒకనాడు బలవంతంగా తలంటి నీళ్ళుపోసింది. సాంబ్రాణి పొగవేసి తలవెంట్రుకలు ఆరబెట్టింది.

ఎవరూ దగ్గరలేనప్పుడు దిగులుపడ్డ ముఖంతో శూన్యంలోకి చూస్తూ గంటల తరబడి కూర్చునేది హేమలత. అలాంటి సమయాలలో బలమైన చెయ్యి ఆమె వీపు మీద పడేది. 'ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?' మణెమ్మ ముఖంలో ముఖంపెట్టి అడగ్గానే కళ్ళు అదొకమాదిరిగా అయి బరువెక్కి మూతలుపడేవి. ఆమె ఒడిలో తలపెట్టుకుని ఆతల్లి వాత్సల్యాన్ని పొందాలని హేమలత మనసు తహతహలాడి పొయ్యేది. ఆమె భుజమీద తల ఆన్చి తనకు జీవితంలో ఇంతవరకూ తెలియని ఆప్రేమను పొందాలనిపించేది. రాత్రిళ్ళు పడుకోబోయేముందు ఆమెవచ్చి 'పిచ్చిపిల్లా వెర్రివెర్రి ఆలోచనలు పెట్టుకోక సుఖంగా నిద్రపో' అంటూ తల నిమిరితే ఎంతో హాయిగా నిద్రపట్టేది.

సాయంకాలము నాలుగుగంటలకు వాకిట్లో బండివచ్చి నిలబడ్డది. హేమలత తన సామాను సర్దుకుంది. అమె మనసు బరువుగా ఉంది. ఆత్మీయతా ఆదరమూ ఇలా ఉంటాయని చూపెట్టిన మణెమ్మను వదలి పోవాలంటే గుండెలో పెద్ద బరువు పెట్టినట్టుగా ఉన్నది. బండి ఎక్కేటప్పుడు వెళ్ళుతున్నానని చెప్పలేకపోయింది. గొంతులో ఏదో అడ్డము పడ్డట్లయింది. మాట స్తంభించిపోయింది. కంఠము గద్గదమయింది. వెళ్ళుతున్నట్టుగా తల ఆడించింది.

'పిచ్చిపిల్లా. అట్లా బాధపడతావేం? నీకెప్పుడు రావాలనిపిస్తే అప్పుడే వచ్చెయ్యి. ప్రతి ఆదివారము వార్డెనుకు చెప్పి వస్తూ ఉండు.' వీపు నిమురుతూ మణెమ్మ హేమలతను బండిలో కూర్చోబెట్టింది.

ఏనాటి మాటయిది? పది సంవత్సరాలయింది. ఈ పది సంవత్సరాలలో ఎన్నో మార్పులు జరిగాయి. హేమలత డాక్టరయింది. మెటర్నిటీ స్పెషలిస్టయింది ప్రాణం పోతుందనుకున్న తల్లులకు నిరపాయకరంగా పురుడుపోసి పండువంటి పాపాయిలను చేతికిస్తున్నది. అనపత్యతతో క్రుంగిపోయే స్త్రీలకెందరికో మాతృత్వము కలిగించింది. వైద్యురాలిగా ఎందరికో బాధోపశమనము

# వీడేనా మా అబ్బాయి

మా అబ్బాయి యెన్నడూ
యింత పరధ్యానంగా,
నీరసంగా, చదువుతో
శ్రద్ధలేకుండా వుండి
వుండలేదు.
ఏమైంది వాడికి!



"వాడు శీఘ్రంగా
పెరుగుతున్నాడు" అని
డాక్టరు అన్నారు.
"అధిక శక్తిని
యిచ్చేందుకు అతనికి
అదనపు పోషకత్వం
అవసరం. హార్లిక్స్
యివ్వండి!"



నేనలాగే చేశాను. ఇప్పుడు మా
అబ్బాయి మళ్ళీ శక్తివంతుడై
ఎల్లప్పుడూ ఉత్సాహంతో ఏ పని
కైనా ముందుకు వస్తున్నాడు. నేను
వాడికి హార్లిక్స్ యివ్వడం
ఎంత మంచిదైంది!

## ఎంత మార్పు కలిగిస్తుంది హార్లిక్స్!






గోధుమపిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన
సారములు మరియు పూర్తి మీగడ గల పాలతో చేయబడినది

# హార్లిక్స్
## అదనపు శక్తిని కలిగించును

శక్తి లేకపోవడంవల్ల పిల్లలు పరధ్యానంగా నిర్లక్ష్యంగా వుంటారు. చాలా సార్లు దానికి కారణం వాళ్లు వినియోగ పరచిన శక్తిని మళ్ళీ యిచ్చేందుకు అవసరమైన పోషకత్వాన్ని వారి ఆహారం యివ్వకపోవడం. అలాంటప్పుడు హార్లిక్స్ యివ్వడంవల్ల అద్భుతమైన మార్పు కనిపిస్తుంది. సులువుగా, శీఘ్రముగా జీర్ణమయ్యేట్లు ఒక ప్రత్యేక పద్ధతిలో మార్పుచెయ్యబడిన సహజ పదార్థాల యొక్క పరిపూర్ణ పోషకత్వమే హార్లిక్స్. అందుకనే పిల్లలకైనా, పెద్దవారికైనా డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సుచేస్తున్నారు.

HL-5842 A

# తోసుకువచ్చిన ముహూర్తం

కలిస్తున్నది. తన సర్వశక్తులూ కూడ గట్టుకుని మానవసేవ చేస్తున్నది.

ఈ పది సంవత్సరాల కాలంలో 'అమ్మ' అన్న శబ్దం వినిపించినప్పుడల్లా మహేశమ్మ జ్ఞాపకం వస్తూనే ఉన్నది. స్నేహితులలో మహేశమ్మ వంటి వారెవరయినా ఉన్నారేమోనని చూపులతో వెదకుతూనే ఉన్నది. తన ఇరుగుపొరుగులలో అటువంటి ఆమె ఎక్కడయినా ఉన్నదా అని గాలిస్తూనే ఉన్నది. తన రోగులకెవరికయినా అటువంటి ఉపచార భాగ్యము కలుగుతున్నదేమోనని ఆమె కళ్లు పరిశోధిస్తూనే ఉన్నాయి. ఆ ఆదరమూ, ఆ వాత్సల్యమూ ఎక్కడ లభిస్తాయి? ఆ తల్లి మహేశమ్మ ఎక్కడ ఉన్నది?

ఆ ఊరినుంచి బదిలీ అయిపోయిన ఎన్నాళ్లకో కుసుమ పెళ్లికి ఆహ్వానము పంపాడు ఆమె అన్న. పెళ్లికోసం కాదు— మహేశమ్మను చూద్దామని ఆశపడ్డది మనసు. ఆఖరిసంవత్సరం పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి. తెల్లవార్లు చదివినా చాలటంలేదు. క్షమించమని నాలుగుపేజీల ఉత్తరం వ్రాసింది.

పెళ్లిఅయిన తరువాత కుసుమ ఉత్తరాలు వ్రాస్తూనేఉంది. ఉత్తరమంతా ఆయనను గురించీ తన చిన్న సంసారాన్ని గురించీ వ్రాసేది—అమ్మ ఎక్కడున్నది అన్నమాటకు జవాబు యివ్వకుండా.

ఒంటరి జీవితమన్నమాటేగాని హేమలతకు వృత్తిలో ఒంటరితనాన్ని గురించి ఆలోచించటానికి తీరటంలేదు. హాస్పిటల్లో రోగులు—ఇంటికి వచ్చిపోయే రోగులు. ఇంటికివచ్చి తనను తీసుకుపోయే రోగులు. వాళ్ళకు వైద్యము, మందులు వీటితో కాలక్షేపము. ఉదయం లేచినప్పటినుంచీ ఇదే వ్యాపకము. మందులూ రోగులూ ... వైద్యము...జరిగినకాలాన్ని లెక్కవేసుకుంటే రెండేళ్లు.

రాత్రి పదకొండు గంటలవేళ. హాస్పిటల్ ఆవరణంలో డాక్టరుకోసం కేటాయించిన క్వార్టర్సులో మంచంమీద గుండెకు చేతులుచేర్చి, పడుకుని, కిటికీలో నుంచి, నీలాకాశంలో చుక్కలమధ్య పదహారు కళలతో మేఘమాలికలను తప్పించుకుంటూ పకపకనవ్వుతూ దాగుడుమూతలాడే ఆ జాబిల్లిని చూస్తున్నది. అంతలో ఎప్పుడో ఆ చంద్రుడిలో మరునాటినుండీ ఒక్కొకళ తరిగిపోతుందన్న దైన్యము తొంగి చూస్తూనే ఉన్నది. చంద్రకిరణాలు పక్కమీద పడుతూఉంటే హాయనిపిస్తున్నది. ఇంత చల్లగా — ఇంతహాయిగా ఉండేది మహేశమ్మమాట. ఒక్కసారి మళ్లీ మనకు జ్వరంవస్తే? మహేశమ్మవచ్చి పిచ్చిపిల్లా అంటూ వీపుమీద చెయ్యివేసి రాస్తూ పథ్యం తినిపిస్తే?

తలుపు కిర్రున చప్పుడయింది. నర్సు వచ్చి లేపింది 'సీరియస్‌కేసు వచ్చింది సిస్టరు రమ్మంటున్నది' అంటూ.

'పురిటి కేసా?' కళ్ళు నులుముకుంటూ లేచింది.

'కాదు. గైనిక్‌కేసు. మీరు త్వరగా రండి.'

నర్సునుపొమ్మని స్టెతస్కోపు మెడకు తగిలించుకుని బయలుదేరింది. రోగికి నాడి బలహీనంగా ఉంది. ఋతుసంబంధమయిన వ్యాధితో పాలిపోయి శుష్కించి ఉన్నది. హేమలత పరీక్షచేసి తాత్కాలికోపశమనం కోసం ఒక ఇంజక్షను ఇచ్చింది.

రోగి అమ్మా అని మూలిగినప్పుడు ఆ కంఠధ్వని ఎక్కడో విన్నట్లు ధ్వనించింది. గుంటలుపడిన ఆ కళ్లల్లో ఏదో వెలుగు తళుక్కున మెరిసింది. వెనక్కుతిరిగి ఆమె ముఖము చూస్తూ ముందుకు నడిచింది డాక్టరు.

మరునాడు రౌండ్సుకంటె అరగంట ముందుగావచ్చి ఆమెచేతిని తనచేతిలోకి తీసుకుని నాడిచూస్తూ 'మీది ఈ ఊరేనా? వెంబడి ఎవరూ లేరా?' అడిగింది.

'మాది విశాఖపట్నము. పది కాన్పులు కన్నాను. నలుగురు బతికారు. కాని వెంట ఎవరూలేరు' తన చూపులు గోడవైపుకు తిప్పుకుని చెప్పింది రోగి. నూతిలోంచి వచ్చినట్లున్నాయి మాటలు. ఆ కొద్ది మాటలకే ఆయాసము వచ్చింది.

'మీరిలా ఉంటే వెంట ఒక్కరూ రాలేరా?'

'అవునమ్మా అందరికీ ఆన్నిపనులు. సంసారాలు. నన్ను కనిపెట్టుకుని ఉండాలంటే ఎట్లా?' తల ఎత్తకుండానే

ముఖాన్ని నాల్చుకున్నది.

'ఇక్కడికి ఎలావచ్చారు మరి?' ఆశ్చర్యంతో అడిగింది డాక్టరు.

'చెల్లెల్ని చూడ్దామని వచ్చాను. రోగానే బలువుచేసింది. చెల్లెలి కొడుకు ఇక్కడ చేర్చాడు.'

ఆమె పరిస్థితి ఆనాడు చాలా అదుర్దాగా ఉంది. ఆపరేషనుచేస్తేగాని బాగు పడదు. ఆపరేషను చెయ్యటానికి రోగి దగ్గర శక్తిలేదు. రక్తము ఎక్కించాలని పెద్ద డాక్టరు అన్నాడు. సరిపడిన గ్రూపు రక్తముకోసము నాలుగురోజులు ఆలస్యము కూడా అయింది.

రోగి ముఖము ముడతలు ముడతలుగా ఒడిలిపోయింది. పళ్ళులేకపోవటంవల్ల దవడలు లోపలికి పీక్కుపోయాయి. మాట స్పష్టంగాలేదు. అయినా హేమలతకు ఆమె నుండి ఏదో వినాలన్న ఆశలూ కాంక్షలూ మనసులో ఊరుతున్నాయి.

ఐదవనాడు ఆందోళనపడుతూ హేమలత తన రక్తముతీసి పరీక్షచేయించింది. ముఖంలో వెలుగు తళుక్కుమన్నది. ఎంతో భక్తితో ప్రేమతో తన రక్తముతీసి ఆమెకు దానముచేసింది. మిగతా రోగులు ఆమె కొరకు డాక్టరుపడుతున్న శ్రమకు ఆశ్చర్యపడిపోతున్నారు.

తెల్లగా పాలిపోయి చావు బ్రతుకుల మధ్య ఉండి, నోటమాటలేక పెదవులు కదుపుతూ ఉన్నదల్లా వారం తిరిగేసరికి కొత్తజీవం పోసుకుని నవనవలాడిపోయింది ఆమె. పక్కమీదనుంచి లేవలేకపోయినా మిగతా రోగులందరినీ మాట్లాడిస్తూ నవ్వుతూ కబుర్లు చెప్తున్నది. లేవలేకపోయినా అందరికీ సలహాలిస్తున్నది. ఆమరునాడు ఆమెకు ఆపరేషనుచేశారు. ఆనాడంతా ఒంటిమీద తెలివిలేదు. హేమలత మూడు రోజులపాటు ఆమెను కనిపెట్టుకుని ఉన్నది.

నాలుగవనాడు ఉదయము నాడి చూస్తూ ఉంటే 'తెల్లవారు ఝామునుంచీ కడుపు నొప్పి తల్లీ!' అన్నది.

'నాకు కబురు పంపలేకపోయారా? వచ్చి ఏదయినా మందు యిచ్చేదాన్నిగా?'

'తిరిగి తిరిగి అలిసిపోయిన బిడ్డను రాత్రిపూట నిద్ర అయినా పోకుండా పిలిపించనా? తెల్లవారగానే ఎలాగూ వస్తారుగా?'

ఆమెమాటలు వింటుంటే హేమలత దేహము జలదరించింది. మనసులో పేరుకుపోయిన మమతలేవో కదలించినట్లయింది.

'ఈ రోగులంతా కాస్త నొప్పిరాగానే హాలు ఎగిరిపోయేటట్లు కేకలు పెడతారు. డాక్టర్ని పిలవమని అరుస్తారు. మీరు అవసరం వచ్చినప్పుడయినా పిలవటానికి మొహమాట పడతారేం?'

హేమలత ఆమెను జాగ్రత్తగా పరీక్ష చేసింది. కళ్ళల్లో ఆందోళన తొణికిసలాడింది. పెద్ద డాక్టరును పిలువనంపింది.

'మీరు చుట్టుపక్కల రోగులతో చాలా సరదాగా విన్నామొన్నా మాట్లాడారట నిజమేనా?'

'ఓపిక ఉంటే మాట్లాడకేం తల్లీ. పాపం వాళ్ళతో కులాసాగా మాట్లాడేవాళ్ళు లేక బెంబేలు పడిపోతున్నారు. మనసులు ఆనందంగాఉంటే సగం రోగాలు తగ్గుతాయి. పాపం వాళ్ళనుచూస్తే జాలివేస్తుంది' ముంజేతులు సవరించుకుంటూ ఒక్కొక్క మాటే అన్నది మెల్లగా.

పెద్ద డాక్టరువచ్చి రోగిలో కలిగిన మార్పు గమనించాడు. రెండు ఇంజక్షన్లు ఇవ్వమనిచెప్పి వెళ్ళాడు. హేమలత రోగులందరినీచూసి ఇంజక్షను యివ్వటానికి వచ్చేసరికి ఆమె ఫాలభాగమ్మీద చెయ్యిపెట్టుకుని కళ్ళుమూసుకుని సన్నగా మూలుగుతున్నది.

'ఏమండి మీ ఊరు ఎట్లా ఉంటుందో చెప్పలేదు ?' సూదితో మందు ఎక్కిస్తూ

అల్లాటప్పయ్య



# తోసుకు వచ్చిన ముహూర్తం

ఆమె ముఖంలోకి చూసింది హేమలత.

'మా ఊరా అమ్మా? ఆ ఊళ్లో ఏముంది తల్లీ. నేను బాగా బ్రతికిన స్మృతిచిహ్నాలున్నాయి. ఆ ఊరి పేరు తలుచుకుంటే కడుపులో పేగులు కదులుతాయి' కన్నీళ్లు కణతలగుండా జారి తలవెంట్రుకలను తడుపుతున్నాయి.

'అయితే వద్దులెండి. మీకు ఈ ఇంజక్షనుతో బాగా నిద్రపడుతుంది తలనొప్పి తగ్గిపోతుంది. మీకెప్పుడు అవసరమని పిస్తే అప్పుడు నాకోసం చెప్పి పంపండి.'

పన్నెండుగంటలకు క్వార్టర్సుకు వెళ్తూ హేమలత ఆమె మంచం దగ్గరగా నిలబడి 'మీకు నిద్రరాలేదూ?' అడిగింది ముందుకు వంగి.

'లేదమ్మా. కడుపులో నరాలన్నీ పీకుతున్నాయి.'

హేమలతకు ఆ పూట అన్నం సహించలేదు. గబగబా వార్డుబాయిని పంపించి వేడినీళ్లు పంచి తెప్పించి కాపుతూ కూర్చుంది.

'నాకు చిన్నప్పుడు కుసుమ అనే స్నేహితురాలు ఉండేది విశాఖపట్నంలో. నేను హాస్టల్లో ఉండి చదువుకుంటున్నాను. ఓసారి కుసుమ తన యింటికి తీసుకు వెళ్లింది...'

'నా రెండోకూతురు కుసుమ ఓసారి తల్లీ తండ్రీలేని పిల్లను యింటికి తీసుకు వచ్చింది. పాపము ఆపిల్లకు తల్లీ తండ్రీ ప్రేమ తెలియనే తెలియదు.'

'ఆఁ ఆఁ. అవునవును' సంతోషం కొద్దీ నోరు తెరిచింది హేమలత.

ఆమెకు కళ్లు మూతలుపడుతున్నాయి. హేమలత వార్డంతా ఒకసారి తిరిగి మళ్లీ ఆ మంచందగ్గర కూర్చుంది. రోగి బాగా నిద్రపట్టినట్టుంది. జాగ్రత్తగా చూడమని నర్సులకు చెప్పి క్వార్టర్సుకు వెళ్లింది.

మరునాడు ఇంజక్షనుయిస్తూ 'రాత్రి బాగా నిద్రపోయారా?' అడిగింది హేమలత.

ఆమె తల ఆడించింది.

'నన్ను చూసిన జ్ఞాపకము ఉన్నదా?'

'ఎప్పుడో ఎక్కడో చూశాననుకుంటున్నాను'

'మీ యింటికివచ్చి వారంరోజులు ఉన్న హేమలతను నేనే. మీరు మెత్తగా అన్నం వండిపెట్టారు. తలంటి నీళ్లుపోశారు.'

'ఔనటమ్మా? నా తల్లే. ఎంత జ్ఞాపకము ఉందమ్మా నీకు?' మాట పూర్తి కాకముందే కళ్ల నీళ్లు చెంపలవెంట ధార కట్టాయి.

'మీకు కాస్త తగ్గగానే నా క్వార్టర్సుకు వచ్చి ఉండాలి అక్కడే ఉంచుకుని మందిస్తాను.'

'ఎంత చల్లటిమాట అన్నావు! అప్పుడే నా బాధంతా తగ్గిపోయినట్టుంది చూడు' హత్తిగిలి హేమ ముఖంలోకి చూసింది. ఆమె తల నిమరపోయింది కాని చెయ్యి పక్కకు వాలిపోయింది.

'మీరు పడుకోండి. ఒక్క గంటలో వస్తాను.'

హేమలత వార్డులో రోగులను చూడటానికి లేచింది.

ఆ పగలంతా మనెమ్మ మగతగా పడి ఉంది. ఆ సాయంత్రపువేళ కష్టపు కాన్పు కేసు వచ్చింది అలిసిపోయిన హేమలత ఎనిమిదిగంటలకు పక్కమీద వాలింది. ఎప్పుడు నిద్రపట్టిందో నర్సొచ్చి లేపితే లేచింది.

'డాక్టర్ ఆ ముసలమ్మ కళ్ళు తేలవేసింది.'

ఆందోళన భయమూ అడుగు ముందుకు పడకుండా అడ్డంవచ్చాయి. తడబడుతున్న కాళ్లతో మంచం దగ్గరికి చేరుకుంది. రోగికి స్పృహలేదు. నాడి చేతికి అందటం లేదు. ఆమెకు స్పృహరావటానికీ,నాడినరిగా కొట్టుకోవటానికి మందులూ ఇంజక్షనులూ ఇవ్వాలని మనసు పాకులాడింది. తోచిన వైద్యమంతా చేసింది. ఆమె చూస్తూ ఉండగానే రోగి తుదిశ్వాస విడిచింది.

'ఒక్కసారి కళ్లు తెరిచి హేమా అని పిలవరూ! పిచ్చిపిల్లా అంటూ వీపుమీద చెయ్యివేసి రాయరూ!' ఆమె గొంతు ఎవరో నొక్కినట్లయింది.

ఆచూపుకోసం—ఆమాటకోసం హేమలత ఆహర్నిశలూ కష్టించింది. ఫలితం దక్కలేదు. ఆమె మనసు తల్లడిల్లిపోయింది. ఒక్క అంగలో క్వార్టర్సు చేరుకుంది. అడ్డంగా మంచమ్మీద పడిపోయింది. దుఃఖపు టలలు

ఉవ్వెత్తున పైకిలేచి ఆమెను ఊపి వేస్తున్నాయి.

ఉదయము ఆరుగంటల బస్సులో కుసుమ వస్తూనే హేమలత క్వార్టర్సుకు వచ్చింది. 'కుసుమా నా గుండె బద్దలయిపోతున్నది. కడుపులో పేగులు చుమ్మలు చుట్టుకు పోతున్నాయి' కుసుమ భుజమ్మీద తలపెట్టి వెక్కివెక్కి ఏడ్చింది.

'హేమా నన్ను ఓదార్చవలసిందిపోయి నీవే ఏడుస్తున్నావా ? అమ్మ పెద్దదయి పోయింది. అయినా నీవు ఎంతమంది రోగులను బ్రతికించగలిగావు చెప్పు ? నీచేతిలో ఎంతమంది రోగులు చనిపోలేదు ? ఏమిటీ వెర్రి? డాక్టరువయిఉండి ముఖం నాచేటట్టు ఏడుస్తున్నావా? అమ్మ అదృష్టవంతురాలు. ఆఖరిదశలో నీచేతిమీదుగా వెళ్ళిపోయింది' హేమలత ముఖాన్ని తనకేసి తిప్పుకుంది కుసుమ.

హాస్పిటల్లో ఆవార్డులో అడుగుపెట్టగానే హేమలత గుండె చెరువయిపోతున్నది. పదిరోజులు సెలవు పెట్టింది. క్వార్టర్సులో ఊరికే కూర్చుంటే మహాలమ్మ ముఖం— ఆమెమాటలు గుండెను పిండేస్తున్నాయి. హేమలతకు దిగులు దిగులుగా ఎక్కడ కూర్చుంటే అక్కడే — ఎటువైపు దృష్టి మళ్లితే అటే—పిచ్చికళ పట్టది.

'సుమతి చూశావా ఒక్కసారయినా వచ్చిందికాదు' ఈమాట పదిసార్లు అనుకున్నది. చిందరవందరగాఉన్న బల్లను శుభ్రపరుద్దామనుకున్నది. బీరువాలో ఎగుడు దిగుడుగా పడిఉన్న పుస్తకాలు సర్దుదామనుకున్నది. బల్లమీద దుమ్ముకొట్టుకుపోతూఉన్న పాత ఉత్తరాలుతీసి బుట్టలో పడేద్దామనుకున్నది. మనసు దేనిమీదా నిలవటంలేదు. మహాలమ్మ ముఖం ఎత్తని అవనికలా ఏమూల చూసినా ఎటువైపు చూసినా కనబడుతున్నది. 'హేమా పిచ్చి పిల్లా...'అంటూ.

ఈ లోకమంతా కటిక చీకటి—మనసంతా చీకటి చీకటిగా ఉంది.

శనివారం ప్రొద్దున్నే తలుపు తోసుకుని లోపలికి వస్తున్నదెవరో సరిగా చూడకుండా డాక్టరు వెంకటచలం 'అప్పలమ్మా. ఇల్లంతా గబగబా ఊడ్చెయ్యి. నీళ్ళు కాకబెట్టు. నేను లేచే లోపల కాఫీ ఇడ్లీ తీసుకురా హోటలు నుంచి' తిరిగి ముసుగు బిగతన్ని పడుకున్నాడు.

కొంతసేపటికి వెంకటచలం కళ్ళు తెరిచి కప్పుకున్న సన్నటిదుప్పటిలోనుంచి చూశాడు. తలుపు సందులోనుంచి వెలుతురు వస్తున్నది. మధ్యలో ఎవరో నిలబడినట్లు నీడగా కనబడ్డది. అప్పలమ్మ ఇంతసేపు మాట్లాడకుండా అట్లా నిలబడిపోయిందేం? ఇంతసేపు మాట్లాడకుండా ఉండటం అప్పలమ్మకు చేతకాదే?

ఎవరైనా తనను తీసుకుపోవటానికి వచ్చారా?

'శనివారం దుర్ముహూర్తం దాటాలి. ఎనిమిది దాటితేగాని నేను పక్కమీదినుంచి లేవను. ఎవరోగాని— తరువాత రండి.'

హేమలత నవ్వాపుకోలేకపోయింది. కడుపు ఒక చేతో పట్టుకుని పక్కనున్న కుర్చీలో కూలబడ్డది.

వెంకటచలం ఆమెను చూసి ఆశ్చర్యపడ్డాడు. చెంపలు పీక్కుపోయాయి, కళ్ళు గుంటలుపడ్డాయి. దేహచ్ఛాయ వన్నె తిరిగింది.

'ఏమిటి హేమా. జబ్బుగాని చెయ్యలేదుదా? పది లంఘణాలు చేసినట్టున్నావు ఏమిటి?' దుప్పటి అవతలికి నెట్టి క్రాపు సర్దుకుంటూ లేచాడు.

కాఫీ యిడ్లీ అయిన తరువాత సిగరెట్టు ముట్టించి ఇహ చెప్పు అన్నట్టు చూశాడు.

హేమలత తలవంచుకుని చేతివేళ్లతో కుర్చీరాస్తూ 'చలం నేను లాంగ్ లీవు పెట్టాను. నాకు ఇక్కడికి మార్పించు. పెద్దఇల్లు తీసుకుని ముహూర్తం పెట్టించు' అన్నది.

వెంకటచలం తబ్బిబ్బయిపోయాడు. 'ముహూర్తం ! దానికి ఇప్పుడువచ్చిందా వేళ? అందుకేనా అట్లా దిగులుపడ్డావు! ఒక్క ఉదుటున కూర్చున్నచోటునుంచి లేచి ఆమె భుజాలు పట్టుకుని ఊపేశాడు.

ఆమె హృదయంలో రెండు వాక్యాలు తల్లడించిపోతున్నాయి. 'అమ్మా అని పిలవటానికి నాకెవరూలేరు. నన్ను పిలిచేవాళ్లు కావాలి.' గొంతులో ఉండ అడ్డుపడినట్టుగా ఉంది. మాటపెగిలి బయటికిరాలేదు.

'చలం ! చలం ! నీ వట్లా ఉన్నావేం క్షౌరమన్నా చేసుకోకుండా?' అతడి గుండెలో తలదాచుకున్నది హేమలత మాట పైకి వినబడకుండా. ●



ఏదో మీ దయ వలన ఇంతవాణ్ని అయ్యా డాక్టర్!

## సెరియల్



తేజోవతి

### జరిగిన కథ

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన చాలవరకు మారిపోయింది. అతను అక్టోబరు ఫాన్సులో స్కూలు ఫైనలు పాసయ్యాడు. శంకరాన్ని పోలీసు కేసులో యిరికిద్దామని వేసిన శారద బాజాలుపథకాన్ని వేణు విఫలంచేస్తాడు. వేణు అక్కయ్య జ్యోతి. ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలాకాలానికి కలుసుకుంటారు. పార్టీరాజకీయాలతో విరోధవర్గాలయిన కుటుంబాలు వాళ్లవి. జ్యోతి రమణ ఇంటికి వెళ్లడాన్ని జ్యోతిభర్త ఆనందరావు సహించలేక పోయాడు. మాట మాటవచ్చి జ్యోతి పుట్టింటికి వెళ్లిపోతుంది. శంకరం మాస్టారిభార్య ఆదర్శంతో జ్యోతి మళ్లీ ఆనందరావును కలుసుకుంటుంది. వేణు కాలేజీలో చేరాడు. జ్వరంతో పరీక్షలు రాస్తాడు.

## 15

'ఏరా రంగా! ... సుశీల యిక్కడ లేదా?...' అడిగాడు వేణు.

'సెలవులకు రమ్మని' వ్రాసిన అక్క వుత్తరం చూసీచూడగానే ప్రయాణం కట్టాడు వేణు ... తీరావస్తే వాకిట్లోకి ఎదురు వస్తుందనుకున్న సుశీల కన్పించలేదు రెండు రోజులైనా...నర్సమ్మగారు మంచంలో పడడంతో జ్యోతికి, తీరిగ్గా వేణుతో మాట్లాడే అవకాశమే వుంటంలేదు ... వేణుకు ఒక్కడే కూచుంటే విసుగ్గా వుంది. అందుకని రంగణ్ని చాటుగా పిల్చి అడిగాడు సుశీల విషయం.

'సుశీలక్క యిక్కడే వుంది బావా ... పిల్చుకురమ్మంటావా?' అడిగాడు రంగడు.

'ఏమని చెప్పి పిల్చుకొస్తావ్?'

'మా బావ వూరినుంచీ వచ్చి రెండు రోజులయింది... నిన్నొకసారి పిల్చుకురమ్మన్నాడు అని చెబుతాను.'

'ఛా! వెధవా!...అలా చెబితే అసలురాదు. 'మా వదిన నిన్ను పిల్చుకు రమ్మంది' అని చెప్పు...'

'ఓ!...అలాగే...' అంటూ ఒక్క పరుగు తీసిన రంగడు, మరికొంచెం సేపటికి సుశీలను వెంటబెట్టుకుని వచ్చాడు.

మేడమెట్లమీద నిలబడి ఎదురు చూస్తున్న వేణు సుశీలను వింతగాచూస్తూ నిలబడిపోయ్యాడు. సుశీల పరికిణీ, ఓణీ వేసుకుంది. ఎండలో తిరగడం మానేసిందేమో, కొంచెం రంగు తేలింది. తనని చూడగానే తలవంచుకుని, పలుకరించకుండా వంటింటివైపు వెళ్లిపోతున్న సుశీలను చూస్తే రవంతకోపం కూడా వచ్చింది వేణుకు. ఇంతలో చక్కగా కబుర్లు చెబుతారు, అంతలో మూతి బిగిస్తారు...ఛీ! యీ ఆడపిల్లల్ని నమ్మగూడదు ! ... అని గూడా అనుకున్నాడు.

'వదినమ్మా !...రమ్మన్నావుట ఎందుకు?' వంటింట్లోంచి వినబడ్డ సుశీల గొంతు విని కట్టూ, బొట్టూ రూపురేఖల్లోనే కాదు, మాటల్లో కూడా మార్పువచ్చిందే ! ... అనుకున్నాడు వేణు.

'నేనా! ... నేను రమ్మనలేదే?... ఎవరు చెప్పారు?' అని అడిగింది జ్యోతి...

వేణు గుండెలు పితపిత మంటున్నాయి. కొంపదీసి, 'అక్క రంగడ్నిపిల్చి అడిగితే వాడు బయటపెట్టడు గదా' అని భయం వేసింది.

'రంగడువచ్చి చెప్పాడు వదినమ్మా...చేతిలో పనికూడ వదిలేసి వచ్చాను.'

'ఏరా రంగా. ... నేను నీతో సుశీలను పిల్చుకురమ్మని చెప్పానా ?'

'నువ్వు కాదులే వదినా ... బావ పిల్చుకు రమ్మన్నాడు ... బావ రమ్మంటే రాదేమోనని నువ్వు పిల్చావని చెప్పమన్నాడు.'

'ఓరి వెధవా! అనుకున్నంత పనిచేశాడు! అనుకున్న వేణు పరిసరాల్లో లేకుండా మాయమయ్యాడు ... ఆ సాయంత్రం వేణు వచ్చాడని తెలిసి అతడి పాతమిత్రులంతా పోగయ్యారు...మళ్లీ 'డ్రామా' వేద్దామా? తోటకెళ్దామా?' అంటూ.

'ఒకసారి అయిన అనుభవం చాలదా' అనుకున్న వేణు ఎక్కడికి రానని అన్నాడు. అతని దృష్టి జ్యోతి లైబ్రరీలోని పుస్తకాల మీద పడింది. పుస్తకం చదువుతూ కూర్చున్నా, ఒక కన్ను అటు వాకిలి వైపే వేసి వుంచాడు సుశీల కన్పడుతుందేమోనని...

ఒకరోజు సాయంత్రం రంగడువచ్చి, 'బావా ! మా జట్టు వాళ్ళంతా వచ్చారు. కబాడీ ఆడుకుందాం. రా...'అని పిల్చాడు వేణు చకచకా మేడదిగి వచ్చాడేకాని, తీరా వాళ్లతో ఆడాలంటే కొంచెం చిన్నతన మనిపించి, 'మీరు ఆడండిరా ... నే నిక్కడుండి చూస్తుంటాను.' అని చెప్పి అరుగుల మీద కూర్చున్నాడు. ఆట మంచిపట్టులో వుంది. ఉత్సాహంగా చూస్తున్న వేణు, తన ప్రక్కనుంచీ వెళ్తున్న సుశీలను చూసి నెమ్మదిగా వెనకాలే లోపలికి వచ్చాడు...

'ఏయ్ పిల్లా ! బొత్తిగా కన్పించటమే లేదేం?' అంటూ ప్రశ్నించాడు.

'మా పిన్ని మొగవాళ్ళ ఎదుటికి వెళ్ళొద్దన్నది...' సుశీల బెరుకుబెరుకుగా అటూ యిటూ చూస్తూ చెప్పింది.

'అబ్బో ! పెద్ద ఆడపిల్ల వయ్యావు గాబోలు ! ... నేను నిన్ను చూడచ్చనీ, నీతో ఎన్నోకబుర్లు చెప్పాలనీ వచ్చానిక్కడికి ... లేకుంటే మా చిన్నాన్న కొడుకు ఖరగ్‌పూర్‌లో వున్నాడు. రమ్మని రాసినా వెళ్ళే వాడిని...' అన్నాడు వేణు నిష్ఠూరంగా...

'ఏం చెయ్యను!...మా పిన్ని పోవద్దంటే ఎలా వస్తాను.'

'నాతో మాట్లాడ్డానికని చెప్పాలేమిటి మీ పిన్నికి? ఏదో సాకున రావాలిగాని...' అంటున్న వేణు దొడ్లో అడుగుల చప్పుడు వినబడగానే మేడ మీదకు వెళ్ళిపోయాడు... సుశీల తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయింది.

మర్నాడు ప్రొద్దున్నే ఆనందరావు ఎటో వెళ్లిపొయ్యాడు. రంగడు తెల్లవారక ముందే చెక్కేశాడు....విసుగ్గా అటూ ఇటూ పచార్లు చేస్తూ! ఛీ! అసలిక్కడికి రాకుండా వున్నా బాగుండేది...అనుకున్నాడు...

ఇంతలో గేటుతీసిన చప్పుడైతే, పిట్ట

గోడ దగ్గరకు వచ్చి చూశాడు ... అతడి చిరాకు క్షణంలో మాయమైంది. గబగబా దిగి క్రిందికి వచ్చాడు...

'సుశీలా!...చెట్టు క్రింద నిలబడి ఏమిటి చూస్తున్నావ్?' అని అడిగాడు వేణు, వాకిటి ముందున్న శివలింగం పూలచెట్టు క్రింద నిలబడి, పూలవైపు చూస్తున్న సుశీలను.

'పూజకు పూలు కోసుకు రమ్మంది మా పిన్ని... పూలు అందటం లేదు.'

'చెట్లెక్కటావుగా కోతిలా ... ఎక్కి కోసుకో...'

'చెట్లెక్కినా. గోడలెక్కినా, కాళ్ళిరగ్గొడతానంది మా పిన్ని.'

'అయ్యో! పాపం!... నీ కాళ్ళకు సంకెళ్ళు పడ్డాయన్నమాట!...పోనీ నన్నుకోసి పెట్టమంటావా?...లేక నేను కోసిన పూలు గూడా పనికి రావా?...'

'కోసిపెట్టు...' అంది వెంటనే సుశీల సంతోషంగా.

వేణు చెట్టెక్కి నాలుగు పూలు కోసి సుశీల చేతిలో పడేశాడు. ఒంటిమీద పాకుతున్న గండు చీమల్ని దులుపుకుంటూ, 'అవి చాలా ... ఇంకా కావాలా?' అని అడిగాడు...

'అవిగో...ఆ కొమ్మన చాలా పూలున్నాయి.' అని వేలుపెట్టి చూపించింది సుశీల. పది పన్నెండు పూలదాకా కోసి క్రిందికి దిగాడు వేణు. పూలు సుశీలకిస్తూ, 'ఇన్ని పూలు ఏం చేస్తావ్?' అని అడిగాడు.

'శివుడికి యీ పూలంటే యిష్టంట... మా పిన్ని పూజ చేస్తుంది.'

'నువ్వే దేముడికి పూజ చేస్తావేంటి?'

'నేను కృష్ణుడికి పూజ చేస్తాను.'

'అయితే—యింకెందుకు!...నాకు పూజ చేసెయ్ సరిపోతుంది.'

'నీ కెందుకూ మధ్యన?' చిరుకోపంతో అడిగింది సుశీల.

'మరి నేను కృష్ణుడ్నేగా! నాకు పూజ చెయి. నువ్వడిగిన వరాలు యిచ్చేస్తాను.' అన్నాడు వేణు.

'ఫో!...ఎప్పుడూ యిట్లాంటి మాటలే మాట్లాడుతావ్!...నేనసలు యీ పూలతో కృష్ణుడికి పూజే చెయ్యను. ఈ పూలంటే నాకు భలే యిష్టం. ఒకటి నేను తల్లో పెట్టుకుని మిగతావి మా పిన్నికిస్తాను.' అంది సుశీల, చక్కగా విరిసిన ఒక పువ్వు తీసి తల్లో పెట్టుకోబోతూ...

'అయితే యింకేం!...నీ పెళ్ళినాడు నాలుగు శివలింగంపూలు కోసి బహుమతి యిస్తే సరిపోతుందన్నమాట!...' నవ్వుతూ అన్నాడు వేణు.

'ఫో'...వెధవమాటలన్నీ...' చేతిలో వున్న పువ్వు వేణు మీదికి విసిరికొట్టింది సుశీల. క్రిందపడకుండా పువ్వు పట్టుకున్న వేణు, 'ఏం?...అయితే పెళ్ళి చేసుకోవా నువ్వు?' అని అడిగాడు.

'కావాలంటే నువ్వే చేసుకో...' అని అక్కడినుండి పరుగెత్తింది సుశీల.

'ఇంతా పూజకు పూలని...యీ పూల



# పూర్వాసంధ్యా ప్రవర్తతే..

బుట్ట యిక్కడె వదిలేశావేం?' అని వేణు అనగానే మళ్ళీ వచ్చి పూలబుట్ట తీసుకుంటున్న సుశీలతో, 'మధ్యాహ్నం తప్పకుండా రావాలి సుమా...' అని హెచ్చరించాడు వేణు.

'సరే' నని తలూపి తుర్రుమని పారిపోయింది సుశీల. నవ్వుతూ లోపలికివస్తూ, విచ్చిన రెక్కలమధ్య శివలింగం, దాని చుట్టూ చిన్న చిన్న లింగాలు, శేషుని వాలికలా చీలివున్న పాము పడగ, ఆ పువ్వు అందానికి ఆనందిస్తూ, ఆఘ్రాణించాడు.

ఆ మధ్యాహ్నం సుశీల హాల్లోకి అడుగుపెడుతూనే, 'వదినమ్మా...' అని పెద్దగా పిలిచింది. అది విని వేణు గబగబా క్రిందికి వచ్చి చూస్తే సుశీల కన్పించలేదు. నిరాశతో తిరిగి వెళ్ళబోతున్న వేణుకు వంటయింట్లో సుశీల గొంతు వినిపించింది. 'ఏం చేస్తున్నావ్ వదినమ్మా?...' అని.

వెళ్తున్నవాడల్లా ఆగాడు వేణు మళ్ళీ వస్తుందన్న ఆశతో...

'టిఫిను చేస్తున్నాను సుశీలా...మరే పని చెప్పొనమకోకుండా మా వేణు ఎక్కడవున్నా డో పిల్చుకొస్తావ్?...చల్లారిపోతే పకోడీలు బాగుండవు... నాలుగు వేడి వేడివి నోట్లో వేసుకుంటాడు.' అన్నది జ్యోతి.

'ఎందుకులే వదినమ్మా...ఇలా యీ పళ్ళెంలో పెట్టివ్వు...ఇచ్చేసి వస్తాను.' అన్న సుశీల మాటలు విని గబగబా పైకి వెళ్ళిపోయ్యాడు వేణు.

రెండు మూడు నిముషాలకల్లా పళ్ళెం నిండా పకోడీలతో, మరోచేతిలో మంచినీళ్ళ గ్లాసు పట్టుకుని పైకొచ్చింది సుశీల.

'ఇవిగో పకోడీలు...వదినమ్మ యిచ్చి రమ్మంది...' అని అక్కడ పెట్టి వెళ్ళిపోతున్న సుశీలను, 'మాట.' అంటూ పిలాడు వేణు. 'ఈమధ్య నన్ను 'బావా' అని పిలవటం మానేశావు. మరెవరవ్వా కొత్త బావ వచ్చి యింకెవర్నీ అలా పిలవద్దన్నాడా...'

'నాకింకెవ్వరూ బావలేం లేరు...నువ్వేగా క్రిందటిసారి అలా పిలవద్దని కసిరి కొట్టావ్!...అందుకని మానేశాను.'

'అప్పుడేదో తమాషాకు అన్నాగానీ...నువ్వు బావా అని పిలుస్తేనే నాకిష్టం. ఇకమండీ అలాగే పిలువు...'

సుశీల జవాబు చెప్పలేదు.

'ఏం యింకమండీ బావా అని పిలుస్తావా?...'

'ఊఁ.'

'మరి నేను నిన్ను సుశీ అని పిలవనా?'

'నీ యిష్టం...నీ యిష్టం వచ్చినట్లు పిలు.' అంది సుశీల.

'నే నిక్కడికివచ్చి ఏడాది దాటిపోయింది... ఎప్పుడన్నా నేను జ్ఞాపకం వచ్చానా సుశీ?...'

'నువ్వే మమ్మల్ని మర్చిపొయ్యావ్‌గాని ... మే మెప్పుడూ అనుకుంటూనే వుంటాం. అసలు సంక్రాంతి సెలవులకు వస్తావని ఎంత ఎదురుచూశాం?...' అంది సుశీల.

'నాకూ రావాలనే వుండేది సుశీ ... కానీ ఎట్లా ? ... అవతల నేను యూనియన్ సెక్రటరీని గదా, బోలెడు పనులు. దానికి తోడు స్ట్రయిక్ చేయించడం, అదీ తీరిక చిక్కలేదు.'

'యూనియన్ సెకరేటరీ అంటే ఏమిటి బావా ?' సుశీల కుతూహలంగా అడిగింది.

'అంటే — మా కాలేజిలో చదువుకునే పిల్లలంతా, ఓట్లువేసి ఒక పెద్దను ఎన్నుకుంటారులే ... ప్రెసిడెంట్‌అనీ, సెక్రటరీ అని...'

'ఓట్లువేశా ? ... మొన్న అన్నయ్యను ఎన్నుకున్నట్లుగానా?...' సుశీల ఆసక్తితో అడిగింది.

'ఆఁ...ఆఁ...అట్లాగే ఎన్నుకుంటారు.... తర్వాత అంతా మనం ఎట్లా చెబితే అట్లాగే వింటారు.'

'అంతా నువు చెప్పినట్లు వింటారా?!! ...' అంది ఆశ్చర్యపోతూ...

'మరేమిటనుకున్నావ్ ! ... మొన్నీమధ్య అందర్నీ 'కాలేజి' మానెయ్యమన్నాను ... అంతే పిట్టపురుగు కాలేజిలో కాలు పెట్టలేదు. నేను మళ్ళీ చెప్పేదాకా అందరూ మానేశారు.'

'అదేంటిబావా! ... ఒక్కపూట రంగడు బడి ఎగ్గొడితే వదినమ్మ కొడుతుందిగదా... నువు మానెయ్యమని ఎందుకు చెప్పావ్?...' తప్పుకదూ?...' అమాయకంగా అడిగింది సుశీల.

వేణుకు ఏంజవాబుచెప్పాలో తోచలేదు...

'తప్పుగాదులే...నీకేంతెలుసు ..పెద్దక్లాసులకు వెళ్ళకొద్దీ ఒక్కొక్కసారి అలా మానెయ్యాల్సి వస్తుంది...'మాగజైన్'లో నా ఫోటోకూడా వేశారు...చూడు...' అంటూ వేణు లేచివెళ్ళి కాలేజి 'యాన్యువల్ మాగజైన్' తెచ్చి చూపించాడు...

ఆ ఫోటోవైపు అలాగే కన్నార్పకుండా చూస్తోంది సుశీల. సైడ్‌వ్యూనుండి తీసిన ఆ ఫోటోలో వుంగరాల జుట్టు. కోటేరు పోసినట్లు ముక్కు, ఆ వ్యూలో వేణును చూస్తుంటే యింకా చూడాలనిపించింది సుశీలకు.

'ఏయ్‌పిల్లా!...మరి ఏమిటట్లా చూస్తున్నావ్?'

'చాలా బాగుంది.'

'అంటే బొమ్మ బాగుందనా? లేక నేను బాగున్నాననా?'

'ఫో ..బావా!... అన్నిటికీను! ... బొమ్మ బాగుంటే నువ్వు బాగున్నట్టు కాదేమిటి?' అంది సుశీల.

'కావాలంటే ఆపుస్తకం పట్టుకెళ్ళు... అందులో నేను వ్రాసిన 'ఆర్టికల్' కూడా ఒకటుంది చదువు...'

'తెలుగులోనా?...'

'కాదు యింగ్లీషులో వ్రాశాను.'

'అయితే నాకెందుకు? ... నేనేం చేసుకుంటాను? ... ఇంకా ఆ ఫోటో చించి యివ్వు ... అంతేగానీ యింగ్లీషు నాకేం వచ్చు?...' అంది మొఖం చిన్నబుచ్చుకు సుశీల.

సుశీలకు యింగ్లీషు రాదని వేణుకు తెలియక పోలేదు...అసలు తెలుగు కూడా యీ మధ్య జోతి నేర్పించిందే ... జ్యోతి మధ్యాహ్నంపూట, రామయ్యగారి కోడలు లక్ష్మి, సరోజినీ యింకా యిద్దరు ముగ్గురు యిరుగు పొరుగు అమ్మలక్కలతో బాటు సుశీలను కూడా దగ్గర కూర్చోపెట్టుకుని చదువు చెప్పింది జ్యోతి. కానీ ఆ విషయం వేణుకు తెల్సినా అప్పుడు మర్చిపొయ్యాడు... చిన్నబోయిన సుశీల మొఖంచూస్తే వేణుకు జాలేసింది...

'నువ్వసలు బడికి వెళ్ళనే లేదా? ... కనీసం యింగ్లీషు అక్షరాలు గూడా నేర్చుకోలేదా?' అని అడిగాడు జాలిగా చూస్తూ..

'మా పిన్ని అసలు బడికి పంపితేగా ... పంపితే నాకూ వచ్చేవే?...' అంది సుశీల

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుని...వేణు తనను ఉద్దేశించే చేస్తున్నట్లుగా అభిప్రాయపడ్డది సుశీల...

'పోనీ యిప్పుడు మాత్రం ఏం పోయింది నేర్చుకోరాదూ?' అన్నాడు వేణు...

'మా పిన్నికి యింగ్లీషు చదువులంటే అసలు గిట్టవు...తెలుగు కూడా వదినమ్మ దగ్గరికి కాబట్టి పోన్లే అని వూరుకుంది'

'చదువేం చేసింది పాపం?...మన మాతృ భాషకు తోడు మరో భాష నేర్చుకునుంటే మంచిదే గానీ చెడేముంది!...నోట్లో అక్షరం ముక్కవుంటే ఏ నాటికైనా వుపయోగపడుతుంది...' అన్నాడు వేణు.

'అయినా — మా పిన్నేమో బడికి పంపదు...ఈ వూళ్ళో ఐదో క్లాసు దాకా తప్ప ఎక్కువ లేదు...ఇక ఎట్లా నేర్చుకుంటాను!'

'ఓస్!... ఎవరినడిగితే ఎవరు నేర్పరు సుశీలా? నేర్చుకోవాలనే అభిలాష వుంటే ఎట్లాగైనా నేర్చుకోవచ్చు...' అన్నాడు మళ్ళీ...

'సరేలే...ముందు పకోడీలు తిను...అవి చల్లారి పోతున్నాయి...' అని జ్ఞాపకం చేసింది సుశీల.

వేణుకు అప్పటిగ్గాని అవి జ్ఞాపకం రాలేదు. ఎడంచేతిలోకి ప్లేటు తీసుకుంటుండగా, అతడి చేతి నున్న గడియారం చూసింది సుశీల.

'బావా!... ఈ గడియారం ఎప్పుడు కొన్నావ్?...' అని అడిగింది సుశీల గబుక్కున వేణు చెయ్యిపట్టుకుని, గడియారం చూస్తూ.

సుశీల తన చేతిని పట్టుకోగానే వేణుకు ఏదో తెలియని అనుభూతి కలిగింది. ఇంత వరకూ ఎన్నడూ రాని ఏదో సరిక్రొత్త భావం వుదయించింది. అలాగే సుశీల తన చేతిని పట్టుకుని చాలా సేపుంటే బాగుండుననుకున్నాడు.

'ఎస్సెల్సీ మంచి మార్కులతో పాసయినందుకు మా అక్కా బావా బహుమతి యిచ్చారుగా ... ఏం గడియారం బాగుందా?...' అతడికి తెలియకుండానే అతడి స్వరంలో మృదుత్వం వచ్చింది.

'ఓ భలే బాగుంది...' గడియారం కేసి చూస్తూనే చెయ్యివదిలేసింది సుశీల.

'ఉండు నీ చేతికి పెడతాను. ఎలా వుంటుందో?...' అంటూ తన చేతి గడియారం తీసి, సుశీల చేతిని తన చేతిలోకి తీసుకుని, గడియారం పెట్టాడు వేణు.

'నీ చేతిక్కూడా బాగుంది కదూ?' అన్నాడు సుశీల కళ్ళల్లోకి చూస్తూ ... విప్పారిన మొఖంతో 'బాగుంది బావా...' అంది సుశీల

'సుశీలా!...' క్రిందనుండి జ్యోతి పిలుపు వినగానే, 'అమ్మో!...నీ గడియారం నువ్వు తీసేసుకో...' అంటూ అతడి చేతిలో పెట్టి ఒక్కపరుగున క్రింది కెళ్ళిపోయింది సుశీల.

వేణు ప్లేటు ఖాళీ చేస్తున్నా మనసునిండా ఆలోచనలు ముసురుకుంటున్నాయి... అతడు కాలేజీకి వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు, చేతిలో ఓ బొత్తి పుస్తకాలు పట్టుకుని, ఎండదెబ్బకు వసివాడిన పూల బాలల్లా, వాలిపోతూ నడుస్తున్న ఆడపిల్లల్ని చూసినప్పుడల్లా సుశీల జ్ఞాపకం వచ్చేది వేణుకు...యూనిఫారం కట్టుల్లో సుశీల ఎలా వుంటుందో వూహించుకుంటుండే వాడు. సుశీల ఎప్పటికన్నా వాళ్ళల్లా వుంటుందా?...అని అనుకున్నాడు...సుశీలకు యింగ్లీషురాదని చిన్నచూపు కాదు... 'నాకు రాదుగా' అంటూ సుశీల పెట్టిన బేలముఖం చూస్తే అతడికి జాలేసింది... అలా ఎందుకు బాధపడాలి సుశీల?...తను మాత్రం ఎందుకు నేర్చుకోకూడదు?... అనుకున్నాడు...

ఆ సాయంత్రం మాటలమధ్యలో జ్యోతితో ప్రస్తావించాడీ విషయం...

'అక్కా!...ఆ సుశీలా వాళ్ళకు తెలుగు చదవనూ, వ్రాయనూ నేర్పావ్ గదా... వాళ్ళకు కాస్త యింగ్లీషుకూడా నేర్పి 'మెట్రిక్' పరీక్షకు కట్టించగూడదూ?' వేణు జంకుతూనే అడిగాడు.

'బాగుందిరా...ఇప్పటికే మీ బావగారు, 'మీ మహిళా వయోజన కేంద్రం' ఎంత దాకా వచ్చింది' అంటుంటారు...ఇక నువ్వు నన్ను 'ట్యుటోరియల్ కాలేజి' కూడా పెట్టమంటావా?...'

'తప్పేముందక్కా...నీకొచ్చిన అక్షరం ముక్క నలుగురికి చెబితే పుణ్యమేగానీ పాపం రాదుగా?...'

జ్యోతి నివ్వెరపోతూ తమ్ముడి మొఖంలోకి చూచింది. ఇదివరలో వేణూ ఎప్పుడూ యిలా మాట్లాడి ఎరుగడు!...తన తమ్ముడు మారాడు!...వాడు శారీరికంగా ఎదగడమే కాదు మానసికంగా కూడా పెరిగాడు... వాడి స్వరంలో కూడా మార్పు వచ్చింది... నూనూగు మీసాలతోబాటు కొత్తవూహాలు పుడుతున్నాయి...ఆలోచనలు విచ్చుకుంటున్నాయి...తనకళ్లముందు పుట్టి తన కొంగు పట్టుకు తిరిగిన వేణు యిప్పుడు తనకు సలహాలిస్తున్నాడు!

జ్యోతి అలా ఆలోచనల్లో పడిపోవడాన్ని వేణు వేరుగా అర్థం చేసుకున్నాడు...తను అన్నదానికి అక్క నొచ్చుకుందేమోననుకున్నాడు...

'పోనీ అక్కా...అందరికీ చెప్పడం నీవల్ల కాకపోతే ఆ సుశీలకైనా కాస్త చెప్పక్కా. గ్రాడ్యుయేట్‌వైన నీతో అంత సన్నిహితంగా తిరిగే అమ్మాయిని కనీసం మెట్రిక్ అయినా పాసు చేయించడం నీ విధి... నీకూడా వుండే పిల్లనైనా మార్చకపోతే ముందు నాకు చిన్నతనంగా వుంది...' అన్నాడు.

'చెప్పడానికి కష్టమైకాదు వేణూ!...ఇదివరలో ఒకసారి నేనూ యిలాగే అన్నాను... 'సుశీలను చదివించమని.' దానికావిడ, 'మాకెందుకమ్మా చదువులు?...ఏదేం దొరసానా? ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్ళేలా?' అంటూ సూటీపోటీగా మాట్లాడింది వాళ్ల పిన్ని...అప్పటినుంచి విసిగించుకున్నాను.'

'ఆవిడకు యిప్పుడప్పుడే తెలియాలని ఏముందక్కా?... మధ్యాహ్నంపూట ఎలాగో వస్తోందిగా, అప్పుడు నేర్పుతుండు...' అంటున్న వేణు అప్పుడే వస్తున్న సుశీలను చూచి 'ఏం సుశీలా! ... నీకు యింగ్లీషు లెక్కలూ అవీ నేర్పితే నేర్చుకుంటావా?' అని అడిగాడు...

'ఎవరు నేర్పుతారు?' అంది సుశీల చాలా వుదాసీనంగా...నిరాశ మొఖంలో కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది.

'మాఅక్క నీకన్నీచెప్పి, మెట్రిక్ పరీక్షకు కట్టిస్తుందట...చదువుతావా?...'

'నిజంగానా వదినమ్మా!...' అంది సుశీల ఆశ్చర్యంతో జ్యోతి మొఖంలోకి చూస్తూ... 'నాకు యింగ్లీషవీ కూడా చెబుతావా?...'

సుశీల ముఖం సంతోషంతో విప్పారింది.

'నీకు నేర్చుకోవాలనే అభిలాష వుంటే, చెప్పడానికేమిభాగ్యమమ్మా...ఎలాగో తెలుగులో చిన్న చిన్న పుస్తకాలు చదువుతున్నావుగా... ఇంకో గంట ఎక్కువ కూర్చుంటే అన్నీ చదువుకోవచ్చు...' అన్నది జ్యోతి.

సుశీల కృతజ్ఞతాపూర్వకంగా జ్యోతివైపు చూసి, యిలాంటి ఏర్పాట్లు చేయించినందుకు సంతోషం వెలిబుచ్చుతూ చూసింది వేణు కళ్లల్లోకి. మెరుస్తున్న సుశీల కళ్ళలోకి తన్మయత్వంతో చూస్తున్నాడు వేణు. వాళ్ళిద్దరినీ ఆక్షణంలో చూచిన జ్యోతికి తనతమ్ముడు తనకు దూరమైపోతున్నట్లుగా అనిపించి ఓ క్షణం అసూయలాంటి భావం ఏదో కలిగింది. అంతలోనే 'ఛీ' ఏమిటిది అనుకుని తన్నుతాను సంబాళించుకుంది.

మర్నాడు మధ్యాహ్నం అనుకున్నవేళకంటె కొంచెం ముందుగానే వచ్చింది సుశీల... వేణు అప్పటికే ఒక 'ప్రైమరీ రీడరు' వెతికి తీసి వుంచాడు...తీరా సుశీల మొదలుపెట్టబొయ్యేవేళకు వేణు చిన్న ధర్మసందేహం వెలిబుచ్చాడు.

'అక్కా! మరో పావుగంటలో మీ మహిళా మండలి అంతా చేరుతుందికదా... వాళ్ళల్లో ఎవరైనా యీవార్త నాళ్ళపిన్నికి ముట్టిస్తే?'

'నిజమే! ఎలా వదినమ్మా? ... మెట్రిక్ లేదు గిట్రిక్ లేదు ... చేపట్నుంచి పుస్తకం ముడితే ఒళ్లు చీరేస్తానంటుందే ... మాపిన్నికి తెలుస్తే...' అంది విచారంగా. అప్పటికే చంద్రబింబంలాంటి సుశీలముఖాన్ని మబ్బులాంటి భయం కమ్మేసింది.

'అయితే వాళ్ళందరూ వున్నంతసేపూ శుభ్రంగా మేడమీద కూచుంటే సరి... తెలియనివి కావాలన్నా నే చెప్పొచ్చు ... ఏమక్కా ఏమంటావ్?'

'సరే ... వాళ్ళందరూ వున్నంతసేపూ, రంగడూ, సుశీలల చదువు బాధ్యత నీదిరా వేణూ!...' అని చిన్న సవరణతోనహా జ్యోతి సమ్మతి తెలిపింది ... రంగడి సంగతి బాగా ఎరిగున్న వేణూ, వాడికి ముందుగానే 'ఈ విషయం ఎక్కడన్నా బయట పెట్టావంటే, నీ తొక్క చీల్చి డోలు కట్టిస్తానని' వార్నింగ్ యిచ్చాడు...

దీక్షగా యింగ్లీషు అక్షరాలు దిద్దుతున్న సుశీల కెదురుగా కుర్చీవేసుకు కూర్చున్నాడు వేణు, తదేకంగా సుశీలనే చూస్తూ...అతడికి తన మాటకు అంత విలువ యిచ్చి, అంత కష్టపడి చదువుకుంటున్న సుశీలమీద అభిమానం కలిగింది వేణుకు...

మధ్యాహ్నమంతా సుశీల చదువుతో కాలక్షేపమైంది వేణుకు...ఆ సాయంత్రం ఏం తోచక వూళ్లో అలా తిరిగొద్దామని బయలుదేరితే ఓ తడికెల హోటలు దగ్గర సీనూ, కృష్ణమూర్తి వాళ్ళూ కన్పించారు... వెళ్లి వాళ్లతో బాతాఖానీ వేసుకున్నాడు వేణు...

'అబ్బబ్బ!... సాయంత్రం పూట ఏం తోచటం లేదోయ్ సీనూ యిక్కడ ... చక్కగా క్రికెట్ బాట్, బాల్ అవీ వున్నా బాగుండును హాయిగా ఆడుకునే వాళ్లం...' అన్నాడు వేణు...

'క్రికెట్ బాట్ అవీ లేవుగానీ—బాడ్మింటన్ బాట్స్, వాలీబాల్, కారెమ్స్, చెస్, అవన్నీ వుండేవి యిదివరకు...ఆ యువజన సంఘ కార్యాలయానికి తాళాలు పడేప్పటికే అన్నీ మూలపడ్డాయి ... ఇప్పుడు వచ్చిన వాళ్ళు పేకాట ఆడుకుంటున్నారు తప్ప యింకే ఆటలూ లేవు...' అన్నాడు సీను...

'ఈ వూళ్లో ఓ యూత్‌లీగ్! దానికో ఆఫీసు కూడా వుండేదేమిటి? అయినా ఆఫీసుకు తాళాలు ఎందుకు పడ్డాయి సీనూ?...'



'సెలవు కావాలన్నాను! అయ్యగారు మిమ్మల్ని అడగమన్నారు!!'

'వేరే ఎందుకు పడతాయి వేణూ! ... తగాదాలవల్ల ... ప్రెసిడెంటు, సెక్రటరీ ఎలక్షన్సు అప్పుడు తగాదాలు వచ్చాయి ... దాంతో ఆఫీసే మూతబడింది ... లేకుంటే 'హాఫ్ కంట్రిబ్యూషను' పద్ధతి మీద 'స్పోర్ట్స్ ఎక్విప్‌మెంట్' అంతా కొన్నాము వేణూ...' అన్నాడు కృష్ణమూర్తి.

'ఒక్క తాళమనుకునేవ్ వేణూ! ... రెండు తాళాలు !! ... తాళం మీద తాళం!!!...' అన్నాడు సీను వ్యంగ్యంగా నవ్వుతూ...

'అరె! ... అంతా చిత్రంగా వుందే! ... ఎవరన్నా యింకా క్రొత్త క్రొత్తవి తమ సంఘానికి సమకూర్చుకోవాలనీ, సంఘాన్ని అభివృద్ధిపర్చుకోవాలనీ అనుకుంటారు! ... వీళ్ళారు వున్న వాటిని మూలపడేసుకుని తాళాలు వేసుకోడం, పైగా ఒకదాని మీద ఒకటి!...చాలా చిత్రంగావుందే! నేనెప్పుడూ వినలేదు...' అన్నాడు వేణు ఆశ్చర్యపోతూ...

'చిత్రమే మరి! ... యూత్‌లీగ్ ప్రెసిడెంటు, సెక్రటరీ ఎలక్షన్సు జరిగాయి. వీడే, మన కృష్ణమూర్తి ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు...దానికి వాళ్ళు 'ఎలక్షన్సు'లో మోసం జరిగింది...మావాడు ఓడిపోవాల్సిన వాడు కాడు. ఇందులో 'మెజారిటీ మాదే... మా యిష్టం లేకుండా యీ సంఘం పని చెయ్యడానికి వీల్లేదని' వాళ్ళు ఆఫీసుకో తాళం వేశారు...' 'మెజారిటీ ఎవరిదో ఎలక్షన్‌లో తేలిపోయిందిగదా...ప్రెసిడెంటు, సెక్రటరీ మేమే వాళ్ళు... తాళాలు వెయ్యడానికీ తియ్యడానికి మీరెవ్వరు?...మా యిష్టం లేందే మీరీ ఆఫీసు తెరవడానికి వీల్లేద'ని మేము వాళ్ళ తాళం మీద మరో తాళం వేశాం...ఇప్పుడు అందులో ఏ తాళం తీసినా, తియ్యబోయినా తలలే ఎగిరిపోతాయి. సమితి అధికారులు తాళాలు తీయించాలని ఎంతో ప్రయత్నం చేసి లాభంలేక వూరుకున్నారు... అప్పటి నుండీ అవలా పడున్నాయి. మాకూ ఆ వుత్సాహం చచ్చిపోయింది...' అంటూ విపులంగా చెప్పాడు సీను...

'అయిందేదో అయింది...మనందరం కలిసి మరో యువజన సంఘం పెట్టుకుందామోయ్...చందాలు పోగుచేసి కట్టామంటే అర్ధ నిమిషం ఆ ఎస్. ఇ. ఒ. గారు క్షణాలమీద యిచ్చేస్తారు... సెలవు అయ్యేదాకా యిక్కడే వుంటావుగా...మాట

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

మాత్రం మీ బావతో అన్నావంటే రేపే పాటికి, పాతదాన్ని తలదన్నేలాంటి యువజన సంఘం సిద్ధమవుతుంది.' అని మాచింపాడు కృష్ణమూర్తి.

'ఏందిరోయ్? ... సంఘం గింగం అంటున్నారు!...ఏంటి కత!...', పొలం నుండి అప్పుడే వస్తున్న వెంకటేశ్వర్లు వచ్చాడు వాళ్ళ మాటలు విని.

'కృష్ణమూర్తి...ఇంకో యువజనసంఘం పెట్టుకుందామనుకుంటున్నాడు...ఎగస్‌పార్టీ వాళ్ళతో తగాదా ఎందుకని...' అని చెప్పాడు సీను...

'అయితే—ఆళ్ళకు జడిసి మనం యింకో సంఘం పెట్టుకోడమా?...ఛీ!... మీాకు సిగ్గులేదుట్రా?...' అన్నాడు తీవ్ర స్వరంతో, తలగుడ్డతీసి విదిలిస్తూ వెంకటేశ్వర్లు...

'అయితే ఏంచేద్దాం మరి?...' సీను అడిగినదానికి, వెంకటేశ్వర్లు,

'తాళాలు బద్దలు కొడదాము రా... చూద్దాం!...ఆ తల తెగ్గోస్తే మొనగాడెవడో ఆళ్ళలో?...' అన్నాడు వెంకటేశ్వర్లు, చేతికర్ర అడుగుతో నేలమీాద కొట్టి...

'నిజమేనోయి కృష్ణమూర్తీ!...వెధవలు, వాళ్ళకెవళ్ళకో జడిసి, మనం వేరుగా 'యూత్ క్లబ్' స్టార్టు చేసుకోడం మనకు సిగ్గుచేటు...రేపే తాళాలు బద్దలు కొట్టి ప్రవేశిద్దాం ... ఎవడడ్డమొస్తాడో నేనూ చూస్తాను...' అన్నాడు వేణు ఆవేశంతో...

'ఎందుకులేరా వెధవ గొడవలు ... ఈమధ్య కాస్త ఏ గొడవా లేకుండా వుంటున్నాం...మళ్ళీ యిదొకటెందుకు?' అని అభ్యంతరం చెప్పాడు కృష్ణమూర్తి. అతనికి తగువులన్నా-కక్షలన్నా తలనొప్పి.

'పోరా పో...నీ కన్నింటికీ బయమేరా?... ఏందిరా ఆళ్ళు చేసేది మన్ని?...మేమంతా విన్నెన్ను కున్నాం...నువ్వట్టా నిలబడు పూరికేనే... వచ్చినోడిని వచ్చినట్టు, ఆమ్మైన దుడ్డుకర్ర ఎత్తి రేపు నెత్తి కడ్డంగా పెట్టేస్తా? అడి తాతతో చెప్పుకోవాలి...' అన్నాడు వెంకటేశ్వర్లు.

'నిజమేరా కృష్ణమూర్తీ!... నువ్వలా నిలబడు ... మేము మిగతా వంగతులన్ని చూసుకుంటాం ... ఏరా వేణూ?...' అని అడిగాడు సీను వేణువైపు చూస్తూ.

'అవునోయ్ మూర్తీ!...చావో బ్రతుకో రేపో విషయం యీా మాటు తేలిపోవల్సిందే...' అన్నాడు వేణు, సీను వెంకటేశ్వర్లను బలపరుస్తూ...

క్షణంలో యిరవై ముప్ఫై మంది యువజనులు పోగయ్యారు...అంతా అదే నిశ్చయానికి వచ్చారు. ఈ విషయం వూరంతా గుప్పుమంది. ఇది విన్న జ్యోతి గజగజలాడిపోయింది...వేణును పిల్చి, 'ఒద్దు వేణూ!... వద్దు...దయచేసి మళ్ళీ యిలాంటి కలతలు లేవవద్దు... నీక్కావాలంటే, వేరే సామాను కొని యిస్తాము ... ఆడుకో...' అంటూ బ్రతిమిలాడింది...

'ఎందుకక్కా అంత భయపడిపోతావ్?... ఏం వాళ్ళేనేంటి ధైర్యస్థులు! ... మేమంతా చెవులు తెగిన దద్దమ్మలమా?...చూస్తాం... ఎవరేం చేస్తారో?...'

'వాళ్ళువాళ్ళు అంటున్నావ్!... ఎవరనుకుంటున్నావ్ వాళ్ళంటే?...'

'ఎవరేమిటి?'

'నాతో కలిసి చదువుకున్నది రవణ... ఆ రవణ భర్తే వెంకట్రావు! ప్రతిపక్ష నాయకుడు...' అంది జ్యోతి.

'ఎవరు రవణక్కా!!...' వేణు తెల్లబోయి చూశాడు అక్క ముఖంలోకి...

'అవునురా ... మరెవరనుకున్నావ్? ... ఒకప్పుడు ప్రాణస్నేహితులంగా వుండేవాళ్ళం మేమిద్దరం ... ఇప్పుడు యిద్దరం బద్ధ విరోధుల భార్యలమయ్యాము!...' అంది జ్యోతి పెద్దగా నిట్టూరుస్తూ...

వేణు మాట్లాడలేదు. అతడి కళ్ళముందు రవణక్క కదులుతోంది. జ్యోతిదగ్గర ఎంత చనువుండేదో రవణ దగ్గరా అంత చనువుండేది వేణుకు అప్పట్లో...అదే ఆలోచిస్తున్నాడు వేణు...

'వెళ్ళి ఒకసారి చూడాలనివుందా వేణూ!' అతడు మౌనంగా వుండడం చూచి మెల్లిగా అడిగింది జ్యోతి.

'ఛట్!.. అక్కడికి వెళ్ళా?...' అన్నాడు ఎఱ్ఱబడ్డ కళ్ళతో వేణు...

'అదేరా? ... యిప్పుడేగా రవణక్కను తల్చుకుని అదోలా ముఖంపెట్టావ్?... రవణ నిన్ను నాకంటె ఎక్కువ ముద్దుగా చూసేదికదా? ... నీకు చూడాలనిపించటం లేదా?' అని అడిగింది ఆశ్చర్యంగా జ్యోతి... అసలు వేణు వెళ్తానన్నా జ్యోతి వద్దనే వుండేది ... కేవలం అతడేమంటాడో తెల్సుకుందామనే అలా అడిగింది...

'చూడాలని వుంటే, యింకెక్కడైనా కన్పడ్డప్పుడు చూస్తాను—అసలు రవణక్క అయ్యేది, మరెవరయ్యేది, మన శత్రుపక్షంలో చేరినప్పుడు విరోధులే!...ప్రాణం పోయినా వాళ్ళ వాకిట్లో అడుగు పెడతామా?...'

'వాళ్ళకు గిట్టనిది మీా బావ కానీ, నువ్వు కాదుగా?...'

'అయితే—ఆనందరావు బావమరిదిని కానా నేను?...అసహ్యంగా వాళ్ళ గుమ్మంలో అడుగుపెట్టి బావ పరువుతీస్తానా?...' అన్నాడు వేణు.

ఒక్క క్షణం మౌనంగా ఆలోచించిన జ్యోతి, 'హు...' అంది పెద్దగా...

'ఏమక్కా అలా అంటున్నావ్?'

'ఏంలేదు. మేనత్త, మేనమామ బిడ్డలకు పోలికలే కాదు బుద్ధులుకూడా ఒక్కటిగానే వుంటాయి గాబోలు...అనుకొని నవ్వుకుంటున్నాను.'

'ఏం బావకూడా ఎప్పుడన్నా నేనన్నట్టు అన్నాడా?'

వేణుకు జవాబు చెప్పకుండా జ్యోతి, విషయం మార్చి, 'వేణూ! నేను నిన్నొకటి అడుగుతాను...కాదనవుగదురా...' అంది ప్రాధేయపడుతూ...

'ఏంటక్కా అది?'

'ఏంలేదు...నువ్వీనాడుంటావ్...రే పెళ్ళిపోతావ్ ... నువ్వు రేపిన యీా మంటలు మాత్రం యింతటితో చల్లారేవి కావు... ఇక మీా బావసంగతి తెల్సుగా...నాకెప్పుడూ ఆయనదే దిగులు. ఇదొకటి రగిల్చి వెళ్ళకు వేణూ!...ఇదివరలో నేను నిన్నెప్పుడూ ఏమీా కోరలేదు...ఇదొక్కటీ కాదనకు వేణూ!...' అంటూ రెండుచేతులూ పట్టుకున్న అక్క కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న నీళ్ళను చూచి కదిలిపోయిన వేణు 'సరే అక్కా...' అని వెళ్ళిపోయ్యాడు.

(ఇంకా వుంది)

# చారిగాడి జోస్యం

కుమార్



'హలో సరళా! ఏమైనా ఉత్తరాలు వచ్చాయా?' అని అడిగాడు, అప్పుడే ఆఫీసు నుంచి హుటాహుటిగా వచ్చిన కుమార్. వచ్చిరాగానే ఉత్తరాలు చూచే అలవాటు అతనిది. 'ఏదో ఒక ఉత్తరము వచ్చింది. ముందు మీరు టిఫిను కానీయండి' అని భార్యామణి సరోజ ఉప్మాప్లేటుతోపాటు ఉత్తరము అందించింది. తొందర తొందరగా ఉత్తరాన్ని చదవసాగాడు. ఉత్తరము పూర్తయ్యేసరికి అతనికి కాలేజీ రోజులు జ్ఞప్తికి రాసాగాయి.

* * *

'ఓరేయ్! చారి!! ఇవాళ పేకాటలో ప్లెస్సో మైనసో చెప్పరా!' అని వేణు చేరితే, 'ఈ ఏడాది ఫస్టుక్లాసు వస్తుందో రాదో చెప్పరా!' అని శేఖర్ చేరేవాడు. అలాగే అందరు ఆమడ దూరం నుంచి చేతులు చాచి చారి రూముకు రావడము మామూలు. ఆహాస్టలులో చారిగాడు పామిస్టు అని అందరికి తెలుసు. నమ్మకమున్నా లేకపోయినా కాలక్షేపానికి ఆ రూములో చేరడం మా అందరికి పరిపాటి. ఏదో చెప్పి టిఫినుకి నెత్తిమీద చేయి వేయడము చారి అలవాటు.

శంకరం కూడా ఈ బాపతే. నాకు పెళ్లెప్పుడవుతుంది? వైఫు (భార్య) ఎలా గుంటుంది? ఇవి శంకరం సర్వసామాన్యంగ అడిగే ప్రశ్నలు. 'నీకప్పుడె పెండ్లేమిటిరా పొరిన్ వెళ్లేవాడివి!' చారి చెయ్యి చూడకుండానే చెప్పేవాడు. చెయ్యిచూసి చెప్పినా ఎలాగు టిఫినురాదని.

ఆ రోజు సాయంత్రం అందరము హాస్టలుముందర లాన్‌లో కూర్చొన్నాం. చారిగాడు కాంటీనుకి వెళ్లి అప్పుడే వచ్చాడు.

రావడమే తడవుగా శంకరం 'ఓరేయి చారి! నీకు వెధవ టిఫినే కాదురా! సినిమాకూడ చూపిస్తా! నా పెండ్లిగురించి చెప్పరా!' అని చెయ్యి చాపాడు. సరే ఇంత మంచి చాన్సు మళ్లీ వస్తుందా అని చారి శంకరం చెయ్యి చేతిలోకి తీసుకొని సీరియస్‌గా చూడసాగాడు. మేమందరము కుతూహలముగా చూస్తూ కూర్చొన్నాము. 'ఓరేయి! నీకు మూడు మనువు తప్పదు. కాని నీ చేతిలో ఎక్కడా కళత్ర వియోగము ఉన్నట్లు కన్పించడంలేదు.' అన్నాడు సీరియస్ పోజులో.

ఇదంతా చూస్తే వాకెక్కడ నవ్వాగడము లేదు. 'ఓరేయి చారిగా! సినివాలా కదా అని రెండేసి పెండ్లిండ్లు చెప్పున్నాను. మొదటి భార్య ఉండగ రెండవ పెళ్లి చేసుకుంటే మనవాడికి శ్రీకృష్ణ జన్మస్థానము శరణ్య మవుతుంది జాగర్త' అన్నా ఉండబట్టలేక.

చారికి ఎక్కడలేని కోపము వచ్చింది 'వీడి జీవితములో వరారు మనువు జరక్క పోతే వెయ్యిరూపాయలు పందెం' అన్నాడు.

అలాగే కళత్ర వియోగం లేకుండా మారు మనువు జరిగితే రెండవపెళ్లినాటికి నా నెలజీతము ఎంతైతే అంత ఇస్తానన్నా. సరే అంటే సరే అన్నాము. అప్పటితో ఆ సంగతి మర్చిపోయాము.

* * *

'ఏమండి! ఉప్మా చల్లాగిపోయిందండీ. ఏమిటా ఉత్తరము' అన్న మాటలకు ఈ లోకంలో ఊడిపడ్డాడు కుమార్. 'సరూ! నీవు నిజముగా పామిస్ట్రీ నమ్ముతావా?' అని ప్రశ్నించాడు. 'ఒక్కసారి ఇందులోకి దిగా రేమిటి! మొదలు చివర లేకుండ. అసలు సంగతేమిటి' అంది కుర్చీ దగ్గరకు జరుపు కుంటూ. 'ఈ ఉత్తరము చదువు నీకే తెలుస్తుంది' అన్నాడు. ఉత్తరము చేతి కందిస్తూ.

బెంగుళూరు
8-3-64

'డియర్ కుమార్!

ఎక్కడినుంచా అని ఆశ్చర్యపోతున్నావుకదు. అవును మరి. మనము విడిపోయి చాలకాల మైంది. మొన్న శ్రీనివాస్ కనబడి నీ అడ్రసు ఇచ్చాడు.

నా గురించి తెలుసుకోవాలని చాల కుతూహలపడుతూ ఉంటావుకదూ! నిజమే ఎవరికైనా సహజమే అది. జీవిత చదరంగం లో మనమందరం పావులము. నాకు చిన్న ప్పటినుంచి ఫారిన్ వెళ్ళాలని అనిపిస్తుండేది స్కాలర్‌షిప్పుమీద ఇంజనీరింగు పాసయిన నన్ను ఫారిన్ పంపే దెవరు? అమ్మా నాన్న చిన్నప్పుడే గోదావరి పాలయ్యారు. ఇంజ నీరింగు అయిన తర్వాత బొంబాయి వెళ్లాను. అక్కడ ఒక చిన్న కంపెనీలో పనిచేస్తు ఉండగ, ఒక అమెరికన్ కెమిస్టుతో పరి చయమయింది. మెల్లగా ఆయనతో అమె రికా వెళ్లాను. అమెరికాలో కూడ జాబు దొరకడం కష్టమైంది. మొత్తానికి టెక్నికల్ హాండు అవ్వడమువలన ఏదో చిన్న ఉద్యో గము దొరికింది. కాని నా ఆశలన్ని పై చదువులమీద నే.

అలా ఆశ నిరాశలమధ్య కొట్టుకుంటూ ఒకరోజు సాయంత్రము ఒక పార్కులో కూర్చొని ఏమి చేయాలి అని తీవ్రంగా ఆలోచిస్తున్నా. అప్పుడే ప్రొఫెసరు నాథ్‌తో పరిచయమయింది. ఆయన వి స్కాన్సిన్ యూనివర్సిటీలో విజిటింగ్ ప్రొఫెసరు. కథ అంతా విని జాలిపడి ఆ యూనివర్సిటీ లోనే ఎం. ఎస్. లో సీటు, స్కాలరుషిప్పు కూడ ఇప్పించారు.

దానితో మన అదృష్టరేఖ మలుపు తిరి గింది. క్రొత్త హుషారు వచ్చింది. మొదటి సంవత్సరము హాయిగానే గడిచిపోయింది. అక్కడ మనవాళ్లు చాలమందే ఉన్నారు. తెలుగువాళ్లుకూడ ఒక 15 మంది దాకా ఉన్నారు. అందులో ఇద్దరు అమ్మాయిలు. ఆదివారాలు పిక్నిక్‌లకి వాటికి పోతుండే వాళ్లం. రాధ మంచి చలాకీగా ఉండేది. ఇద్దరము కలిసే తిరిగేవాళ్లము. మా పరి చయము స్నేహముగను, స్నేహము, అను రాగముగను రూపాంతరము పొందింది. ఈ స్నేహము ఎంతవరకు వచ్చిందంటే. ఒకళ్లను విడచి ఒకరు ఉండేవారము కాదు.

రాధ తండ్రికూడ సుముఖుడుగా ఉండ డము వలన మా పెళ్లి నిరాడంబరముగ జరిగిపోయింది. తరువాత ఇంకో రెండేండ్లు అక్కడే ఉండి డాక్టరేటు కూడ పుచ్చు కొన్నాము.

6 నెలల్రకిందటే మేము ఇండియా వచ్చాము. ఇద్దరము బెంగుళూరు ఇన్‌స్టి ట్యూట్‌లో రీడర్సుగా చేరినాము.

నా జీవితాన్ని గురించి ఆలోచిస్తే నాకే ఏదోలా అనిపిస్తుంది. తల్లిదండ్రులపేరైనా పూర్తిగ తెలియదు. అనామకుడిగా రోడ్ల వెంబడి తిరగవలసినవాడిని ఫారిన్ వెళ్లి వచ్చా. ఇంతకంటె ముఖ్యవిషయము నీవు ఆశ్చర్యపోయేది ఇంకో విషయముంది. కాని ఇది చెప్పేలోపల నీ నెల జీతమెంతో నాకు తెలియపర్చవలెను. ఎందుకంటే చారి పందెము గెలిచాడు.'

'ఏమండీ ఈ పందెము ఏమిటి? నాకు ఎప్పుడూ చెప్పలేదే' అంటు సరోజ కుమార్ వైపు తిరిగింది.

'అదంతా ఒక పెద్ద కథలే. లెటరంతా చదువు నీకే అర్థమవుతుంది.' అన్నాడు కుమార్.

'నేను ఈ 26 యేళ్లలోను రెండు సార్లు పెళ్లిచేసుకొన్నా. కాని ఇంతకంటె ఆశ్చర్యకరమైన విషయము రెండుసార్లు రాధనే పెళ్లిచేసుకున్నా. ఇటువంటివి జరుగు తాయా అని నువ్వు ఆశ్చర్యపోవచ్చు. ఇంకె వరికైనా ఏమోగాని నా సంగతి మాత్రము నిజము.'

'అమెరికానుంచి రాగానే రాధ నేను ఒక నెలరోజులు వాళ్లింట్లోనే గడిపాము. ఒక రోజు సాయంత్రము భోజనాలయాక అందరం బయట లానులో కూర్చొన్నాము' ఆరోజు మా మావగారే కదిపారు. 'వీడిదే వూరని'. ఇన్నాళ్లు తన అల్లుడి ఊరేది, తల్లిదండ్రులెవరు, అని అడగకుండా ఎలా ఉండకలిగేడా అనిపించింది నాకు, అందు లోను తెలుగువాడైయుండి. ఇక నాగురించి చెప్పక తప్పదనిపించి ప్రారంభించా.

'మావగారు! విధి ఎంతవరకు ఆడుకో వాలో అంతవరకు ఆడుకుంది నాతో. చివ రకు నేనే గెలిచాననిపిస్తోంది. మా నాన్నగారు ఖండవిల్లిలో మేష్టారుగ పనిచేసే వారు. ఆరోజు నాకు బాగా జ్ఞాపకము. మా మావయ్యగారూరు వెళ్లడానికి బయలుదేరాము. దారిలో గోదావరి దాటాలి. పడవ సగంలో ఉండగ ఈదురుగాలి ప్రారం భించింది. అసలే నిండు గోదావరి. ఆ గాలికి భయపడి నేను మా అమ్మ గారి ఒడిలో కూర్చొన్నా. అంతే తరువాత ఏమయింది తెలియదు. తరువాత నాకు తెలి సింది రాజమండ్రి అనాధాశ్రమం. అనాధా శ్రమం వాళ్లే నన్ను స్కూలుఫైనలుదాకా చదివించారు. తరువాత గవర్నమెంటు స్కాలరుషిప్పుతో ఎలాగో బి. ఇ. వరకు గెంటుకెళ్లా.

'పాపం మీ నాన్నగారిపేరైనా తెలియు దన్నమాట నీకు' అన్నారాయన.

'పూర్తిపేరు తెలియదు కాని అయన్నం దరు జగ్గారావు మేష్టారు అనేవారని' చెప్పా.

'జగ్గారావు కొడుకువా.' అంటు ఆయన ఆశ్చర్యపోయారు. 'జగ్గారావు ఎవరోకాదు. నా సొంతబావ. అతను బడిపంతులని నేను కొంచెము లోకువగా చూచేవాడిని. అతనికి ఆత్మాభిమానం ఎక్కువ. దానితో నేను ఏదైనా అనేసరికి చాల కోపమొచ్చేది. అప్పుడే నాకు సర్వీసు కమిషన్ సెలక్షను వచ్చింది. దానితో నాగర్వానికి అంతుండేదికాదు. ఒక రోజు ఏదో అంటే బావకి కోపము వచ్చి, మళ్లీ మీ గుమ్మం తొక్కితే ఒట్టని వెళ్లి పోయాడు అక్కయ్యని తీసుకొని. ఇలా జరుగుతుందని అనుకోని నేను స్తబ్దంగ

ఉండిపోయా. నాన్నగారు తిడుతూ ఉంటే అయిదేళ్లు ఇట్టే గడచిపోయాయి. అక్కయ్య మాత్రము పండులకు వస్తూ ఉండేది. ఈలోపల నాన్నగారికి పక్షవాతం

## చారిగాడి జోస్యం

వచ్చింది. ఇంకా ఆయన ఆట్టేకాలము బ్రతికేలా లేరు. నాకు బావకి మధ్య దూర మవుతున్న సంబంధం చూసి నాన్నగారు అక్కయ్య కొడుక్కి నా కూతురు నిచ్చి పెళ్లి చేయాలని కూర్చొన్నారు. ఆఖరి ఘడియలలో ఆయన మనస్సుకు క్షోభ కలుగ చెయడమెందుకని సరే అన్నా, మనసులో ఇష్టంలేక పోయినా. నా కూతురు ఫారిన్ వెళ్లాలని పెద్ద ఆఫీసరుని పెండ్లాడాలి అని ఉండేది నాకు.

మా నాన్నగారి పట్టు ఉడుం పట్టు. ఆయన అప్పటి కప్పుడే పురోహితుడిని పిలిచి 7 ఏళ్ల సుబ్బారావుకి, 4 ఏళ్ల రాధకి పెండ్లి జరిపించేసారు. పెండ్లి అంటే జరిగింది కాని మా మధ్య అంతస్థుల తారతమ్యము పెరుగుతూనే ఉంది. తరువాత నాకు ఫారిన్ పోస్టింగ్ రావడంతో రాకపోకలు లేవు సరిగదా ఉత్తర ప్రత్యుత్తరాలే ఆగిపోయాయి. ఇండియా వచ్చాక నాకబురు చేస్తే సరి అయిన సమాధానమే దొరకలేదు. అప్పటితో నాలో ఉన్న అహం పూర్తిగ చచ్చిపోయింది. చివరకు స్వయంగ ఖండపల్లిలో వచ్చి ఉన్నా అక్కా బావ గురించి ఏమీ తెలియలేదు. ఆ సుబ్బారావు ఎవరో కాదు నీవే నాయనా.' అని ఆయన కూలబడ్డారు.

ఆయన ముగించేసరికి నువ్వు నమ్ము నమ్మకపో కుమార్! నాకు జ్ఞాపకము వచ్చింది ఎవరో తెలుసా! చారిగాడు, నీ నెల జీతం. ఇంత కరెక్టుగా రెండు పెండ్లిండ్లు, కళత్ర వియోగం లేకుండా చేయించిన ఘనత వాడిదే తప్పుతుందామరి ఇచ్చేయి నీ నెల జీతము. ఇదంతా నా వల్ల వచ్చింది కాబట్టి నేను సగం భరిస్తాలే. చారి హైద్రాబాద్‌లో పనిచేస్తున్నాడు వాడికి వ్రాస్తానులే 'ఇదంతా కథలా ఉంది కదూ' నీకు.

ఇట్లు
శంకర్.

'ఏమండీ! ఇది నిజంగ జరిగిందా? లేక వీరా దగ్గర జీతము కాజెయ్యడానికి వేసిన ప్లాను కాదుకదా!' అని సరోజ అనుమానంగా ప్రశ్నించింది.

కాని ఇంత తెలివి చారిగాడికి లేదు. శంకరానికి అంతకంటే లేదనిపించింది కుమార్‌కు. ●

# వారఫలం

**4-8-1967 శుక్రవారం మొదలు**
**10-8-1967 గురువారం వరకు.**

**మేషం:** ఇతరులనిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి గాని మీస్వంతపనుల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనంగల వ్యక్తులను కల్పుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**వృషభం.** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**మిధునం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో పోటీవారి పోటీని యెదురించి అనుకూలతను సాధించగలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** ఇదివరకు మీకార్యక్రమాల్లో యేర్పడినఅవరోధాలు తొలగిపోతాయి. అధికారులవలన వ్యవహారాలు సులువుగ నెరవేరతాయి. వారం మధ్యలో ఆర్థికవ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభించ గలవు.

స్త్రీలకు:— కుటుంబవ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** వారంప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

**కన్య:** మీ ఆలోచనలు మీకే కాకుండా మీ మిత్రులకుకూడా లాభదాయకంగా ఉంటాయి. సమయానికి యేదోఒకవిధంగా డబ్బు చేతికివస్తుంది. వారంమధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడుతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాసవస్తువులు కొంటారు.

**తుల:** వ్యాపారంలో యిదివరకు ఆగిపోయిన వ్యవహారాలను ఇప్పుడు అనుకూలంగా పూర్తిచేయగలరు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలుకూడా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. వారాంతంలో అనుకోని చికాకులకు గురికాగలరు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలసంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** వృత్తివ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగందు. వ్యాపారంలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణించ గలదు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. ఏవ్యవహారంలోను యితరులమీద విశేషంగా ఆధారపడడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించ గలవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం:** ఫలితం మాట యెలాగ ఉన్నా ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం** వ్యాపారంలో క్రొత్తవారి పోటీ యెదుర్కొవలసి వస్తుంది. నూతన వ్యవహారాలు శ్రమమీద ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్పుకొంటారు. పోటీవారితో మాటపట్టింపులు తగవు. సాహిత్య కళారంగాల్లో మీకృషికి ఆటంకాలు వస్తాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం:** వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. పోటీవారితో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్

# ఆంధ్ర నాట్యబృందం విదేశపర్యటన

ప్రపంచ యువ నాట్యకారుల ప్రదర్శనలు ఈ ఏడు ఫ్రాన్సులోని నాన్సీ పట్నంలో జరిపారు. దీనికి మా బృందాన్ని ఆహ్వానించారు.

ఇరవయి ఒక్కమంది ఏప్రెల్ 26 వ తేదీ ప్రత్యేక విమానంలో మద్రాసు నుంచి బొంబాయికీ, అక్కడినుంచి ఒక టి. డబుల్యు. ఎ. విమానంలో కయిరో, రోమ్‌ల ద్వారా వెళ్ళి 27 వ తేదీ పారిస్ చేరుకున్నాము.

పారిస్ చాలా అందమయిన మహానగరం. ఫాషన్లకి పుట్టినిల్లు. నాన్సీ పట్నం ఇక్కడికి సుమారు 375 మయిళ్ళ దూరంలో ఉంటుంది. ఈ దూరాన్ని రయిలుబండిలోనే ప్రయాణం చేశాము. బండి దిగగానే ప్రదర్శన నిర్వాహకుల ఆహ్వానాన్ని చూరగొని తర్వాత మాకు ఏర్పాటు చేసిన 'అమెరికన్ లాడ్జి' కి వెళ్ళిపోయాము.

నాన్సీ చక్కటి ఊరు. విశాలమయిన వీధులు, ఎత్తయిన కట్టడాలు. మర్నాడు పొద్దున ఊరంతా చూశాము. మధ్యాహ్నం మాకు ప్రత్యేకమయిన విందు ఏర్పాటు చేశారు. మా ప్రదర్శనలకి ప్రపంచంలో వివిధ భాగాలనుంచి సుమారు 2000 మంది వచ్చి పాల్గొన్నారు.

మా ప్రదర్శనలు 30–4–67కి ఏర్పాటుచేశారు. ఇందులో కుమారి తేజస్విని రావు నారాయణ తీర్థ తరంగము ప్రదర్శించారు. ఈమె తండ్రిగారు అయి. ఎస్. అయి. సంస్థ డయిరెక్టరు. కుమారి రావు కలకత్తాలో బి.ఎస్‌సి. చదువుకుంటున్నారు, ఇంతకిముందు కూడా విదేశాలలో ప్రదర్శనలు చేశారు.

ఆమె తర్వాత కుమారి పంకజ మయూరి నృత్యం ప్రేక్షకులని ఆనందపరిచింది. ఈమె మద్రాసు మాజీ డిప్యూటీ మేయర్ శ్రీ టి. వేణుగోపాలరావుగారి పుత్రిక.

రాత్రి ఎన్నో రకాల డాన్సులు జరిగాయి. వాటిలో నేనూ, శ్రీ నంజప్ప పాల్గొన్నాము. అప్పుడే 'బాలట్' ఫలితాలు ప్రకటించారు. మా జట్టుకి 85 శాతం వోట్లు వచ్చాయి. మేము ఒక ఇంగ్లీషు డ్రామా వేసి ఉండవలసింది కాని వెయ్యలేక పోయాము కాబట్టి



నాన్సీ రంగస్థలముపై ప్రదర్శనలో (కుడినుంచి) శ్రీ నంజప్ప, నాట్యాచార్య యం. యస్. శైవా కుమారి రాధ, కుమారీ పుష్పాప్రసాద్, కుమారి టి. తేజస్వినిరావు. కుమారి టి. పంకజ, కుమారి నళిని సుబ్బారావు, శ్రీ జనార్ధనరావు, శ్రీ వేణుగోపాలరావు.



నాట్యాచార్య యం. యస్. శైవా

బహుమతులలో మూడవది లభించింది.

నాన్సీ నుంచి తిరిగి పారిస్‌కీ, అక్కడ నుంచి బెల్జియం దేశానికీ, బెల్జియం నుంచి చెకోస్లొవేకియా మీదుగా పోలండ్‌కి వెళ్ళాము. పోలండ్‌లోని రాక్లా నగరంలో 5000 సీట్లకి పయిగా ఉన్న పెద్ద 'థియేటర్' ఒకటి ఉంది. రాక్లాలోనే నేను నృత్యం గురించి విపులంగా ఉపన్యసిస్తూ, కొన్ని భంగిమలని చేసి చూపించాను. ఆ తర్వాత మరి కొన్ని ప్రదర్శనలు ఇచ్చాము. ప్రతిసారీ థియేటర్ 'హవుస్‌ఫుల్' అయింది.

రాక్లానుంచి వార్సా వెళ్ళాము. అక్కడ టెలివిషన్‌లో ప్రదర్శనలు ఇచ్చాము. పక్క వాద్యాలు నిర్వహించిన శ్రీయుతులు నంజప్ప (పిల్లనగ్రోవి), మూర్తి (మృదంగం) బాగా సహకరించారు. దర్శకత్వం నేను వహించాను.

పోలండ్ చక్కటి దేశం. నాకు చాలా నచ్చింది. అయితే అక్కడ పురుషులకన్నా స్త్రీలే ఎక్కువ కనపడ్డారేమో అనిపించింది!

పోలండ్‌లో మమ్మల్ని బాగా కదల్చివేసిన చోటు హిట్లరు సృష్టించిన 'కాంప్'. ఇక్కడ 40 లక్షలమంది యూదులని దారుణంగా హత్యచేశారు.

అక్కడినుంచి క్రాకో, లీవీస్‌ల మీదుగా జర్మనీ వెళ్ళాము. ఫ్రాంక్‌ఫర్ట్‌లో నృత్య ప్రదర్శనలు చేశాము. ఫ్రాంక్‌ఫర్ట్ నుంచి నేను, మూర్తిగారు మనదేశం తిరిగి వచ్చేశాము!

—ఎం. ఎస్. శైవా



కుమారి రేణుక

సినిమాల్లో నటించాలని ఏమాత్రం ఉత్సాహం ఉన్నవారికైనా యిపుడు చక్కటి అవకాశాలు లభిస్తున్నవి అలాగని ఎవరికి పడితే వారికి అవకాశాలిస్తున్నారని కాదు, అందచందాలు, అందుకు తగిన శరీర సౌష్ఠవం, నటనలో అనుభవం, నాట్యంలో శిక్షణ ఉన్నవారిని ప్రోత్సహించి సినిమాలలోకి తీసుకుంటున్నారు నిర్మాతలు ఇన్నీ వున్నా పూర్వం కొత్తవారికి వేషాలు దొరకటం అపురూపమైపోయింది ఇపుడు కొత్తవారికి అవకాశాలు కల్పించడంలోను, కొత్తతరహా చిత్రాలను నిర్మించడంలోను పరిశ్రమ ముందంజ వేస్తున్నది.

ఇపుడిలా కొత్తగా సినిమాల్లో నటించాలని ఉత్సాహపడుతున్న వారిలో కుమారి రేణుక ఒకరు పచ్చని శరీరచ్ఛాయతో పరువంలోకి అడుగుపెట్టిన కుమారి రేణుక 1950 నవంబరు 9 న జన్మించింది చిన్నప్పట్నుంచీ నాటకం అంటే ఉత్సాహం కనపరిచేది తొమ్మిదో ఏటనుంచీ [illegible] పరపవద్ద నృత్యం అభ్యసించింది 1961 ఫిబ్రవరి 9 న మైలాపూర్ రసికరంజని సభలో— అప్పటి మద్రాసు శాసనసభ స్పీకరు డక్టరు యు. కృష్ణారావుగారి సమక్షంలో అరంగేట్రం యిచ్చింది ఆనాటి సభకు ప్రసిద్ధ నటీనటులు జానకి, యస్. వి రంగారావులు హాజరయి, యీ చిరంజీవిని ఆశీర్వదించారు.

అలా నాటినుంచి నేటిదాకా ఓపక్కనుంచి నృత్య ప్రదర్శనలిస్తూ, మరోపక్కనుంచి చదువుకొంటున్నది మొన్ననే పి. యు సి. పూర్తిచేసింది. సెకండ్ క్లాస్ వచ్చింది. మద్రాసు, కేరళ, మైసూరు బొంబాయి, హిమాచలప్రదేశ్ మున్నగు చోట్ల నృత్య ప్రదర్శనలు యిచ్చి పలువురి మెప్పుకోళ్లను, అనేక బహుమతులను అందుకొన్నది.

తీరికవేళల్లో నృత్యంలో కొత్తరీతులను తెలుసుకోవటం, ప్రాక్టీసు చేయటం— పాటలు పాడుకోవటం, పుస్తక పఠనం కుమారి రేణుకకు సరదాలు. స్పష్టమైన ఉచ్చారణ, వినయం, సంస్కారంగల రేణుకకు భరతనాట్యం, ఓరియంటల్ లే కాదు, నేటి ఆధునిక పాశ్చాత్య నృత్యాలన్నిటిలోనూ మంచి ప్రవేశం ఉన్నది. నటి కాగోరే యీ నవకొత్త నర్తకిని కూడా ప్రోత్సహించడం అవసరం!

—మోహన్ కుమార్ ●

## అవీ - యివీ...

### మిస్ పసిఫిక్ బొంబాయి ఆగమనం

చెస్‌బ్రోహెండ్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్ (ఆస్ట్రేలియా) వారు నిర్వహించిన పసిఫిక్ అందాల పోటీల్లో మలేసియాలోని కౌలాలంపూర్‌కు చెందిన బెట్టీలిమ్ 'పసిఫిక్‌రాణి'గా ఎన్నికయింది భారత దేశం తరఫున పాల్గొన్న కుమారి నఖిజహాన్ ద్వితీయ స్థానాన్ని ఆక్రమించింది

మిస్ పసిఫిక్ జూలై 15, 16 తేదీల్లో బొంబాయికి వస్తుంది

### వైఫా నాటక కళాపరిషత్తు

వెల్లూరుఫిలిం జర్నలిస్ట్స్ అసోసియేషన్ ఆధ్వర్యాన చతుర్థ నాటక కళాపరిషత్తు నాటక నాటిక ఏక పాత్రాభినయ పోటీలు రాష్ట్ర స్థాయిలో 1968 జనవరి 8 మొదటి వారంలో భారీఎత్తున వెల్లూరు టవున్ హాలులో ప్రారంభింప బడతాయి వారం రోజుల పాటు జరిగే యీ పరిషత్తులో ప్రవాసాంధ్రులకు ప్రవేశార్హతవుంది. విజేతలకు ప్రముఖ సినీనటి సినీ కళాకారుల తరఫున బహుమతీ ప్రదానం చేస్తారు.

(వివరాలకు: వి. అబ్బయ్య సెక్రటరీ వైఫా నాటక కళాపరిషత్తు నెం 170. ఎం వి అగ్రహారం వెల్లూరు) ●



తమిళ మహిళలు సావిత్రిని సత్కరించారు, సన్మానించారు, ఆమె 150 చిత్రాల్లో నటించిన సందర్భంగా. ఇదివరలో వారే ఆమెకు 'నడిగయిర్ తిలకం' అనే బిరుదును ప్రసాదించి గౌరవించారు ఈ మహిళా మండలి శ్రీనివాస గాంధీ నిలయం పేరుతో నిర్వహింపబడుతున్నది ఈ సన్మాన సభకు మద్రాసుమంత్రి శ్రీ వి ఆర్. నెడుంజెళియన్ అధ్యక్షత వహించారు.



వేదికపై సన్మానమందుకుంటున్న శ్రీమతి సావిత్రి. మంత్రి శ్రీ నెడుంజెళియన్, శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్ లనుకూడా యిందులో చూడవచ్చు.

# ఆంధ్రుల బిడ్డ తమిళుల కోడలు

'సావిత్రి తమిళంఎట్లామాట్లాడుతుందో నాకు తెలీదుగాని, తెలుగు ఉచ్చారణమటుకు చక్కగా, స్పష్టంగా, ఎంతో హుందాగా వుంటుంది ఆమె తన నటజీవితానుభవాన్ని పురస్కరించుకొని త్వరలో ఒక చిత్రానికి దర్శకత్వం వహించబోతున్నది'— అన్నారు జగ్గయ్య ఆంగ్లంలో ప్రసంగిస్తూ 'సావిత్రి ఆంధ్రుల బిడ్డ, తమిళుల కోడలు ఆమె తమిళం ఎంతో స్వచ్ఛంగా, ద్రవిడమున్నేట్ర కజగం వారు మాట్లాడేంత మంచి భాషలో చక్కగా మాట్లాడుతుంది' అంటూ చెప్పారు ఎ. యల్. శ్రీనివాసన్.

* * *

'శ్రీమతి సావిత్రి త్వరలో ఒక చిత్రం డైరెక్టు చెయ్యబోతున్నారనే విషయం జగ్గయ్య చెప్పారు. నటనలో విశేషమయిన అనుభవం గడించిన ఆ మహానటి చేతిక్రింద పనిచేస్తే మంచినటుడిగా రాణించే అవకాశం ఏర్పడుతుంది. ఆమె దర్శకత్వం వహించే చిత్రంలో నాకొక వేషం యిచ్చి చక్కని నటుడుగా తీర్చి దిద్దుతారని నా ఆశ ... జెమినీగణేశ్ యిక్కడే వున్నారు. వారూ సావిత్రిగారి గురించి మాట్లాడితే వినాలని వుంది' అన్నాడు, యిపుడిపుడే తమిళ చిత్ర రంగంలో అభివృద్ధిలోకి వస్తున్న కొత్త నటుడు జయశంకర్.

* * *

శ్రీమతి సౌందరం కైలాసం జెమినీ గణేశ్‌ను స్టేజిమీదకు ఆహ్వానిస్తూ 'వీరు ప్రేక్షకుడిగా మాట్లాడాలి!' అన్నప్పుడు సభికులు తమ హర్షామోదాలు తెలిపారు. జెమినీ స్టేజిమీదకి వచ్చి శ్రీమతి సావిత్రి మెడలో పూలమాల వేయగానే— ఆమె హృదయం పులకించిందో ఏమోగాని, కిందికి వంగి భర్త పాదాలను స్పృశించి కళ్లకు అద్దుకుంది. ఆ పతిభక్తి అందర్నీ కదిలించింది.



నడిగయిర్ తిలకం శ్రీమతి సావిత్రి.



అభినందిస్తున్న అంజలి.



'కంచుకోట' శతదినోత్సవ సందర్భంలో ప్రసంగిస్తున్న శ్రీ నార్ల వెంకటేశ్వరరావు. సావిత్రి, సి.యస్.రావు, యన్.టి.రామారావులనుకూడా ఈచిత్రంలో చూడవచ్చు.

# చిత్రలహరి

## 'నాకు మంచి భార్య'

'సావిత్రిని గురించి ఏం చెప్పవలసి వచ్చినా—నా భార్యగానే చెప్పవలసివుంటుంది. ఆమెకు యిక్కడ జరుగుతున్న యీ సన్మానం చూసి నా హృదయం ఆనందపరవశమవుతున్నది. 150 చిత్రాల్లో నటించి, విభిన్న భూమికల్లో జీవించిన ఆమె నాకు మంచి భార్య. నా పిల్లలకు తల్లి. సావిత్రిని భార్యగా పొందటం నేను చేసుకున్న పెద్ద అదృష్టం.' అన్నారు జెమినీ గణేశ్.

'నా మాతృభాష ఒకటి, నేను ప్రేమించిన భాష వేరొకటి...ఈ రెండింటితోనూ నాకు అవినాభావసంబంధం వుంది' అంటూ శ్రీమతి సావిత్రి మొట్టమొదట కెమెరా ముందు నిల్చున్న రోజునుంచి నేటి దాకా తన నటజీవితానుభవాలను వివరించారు 'ఇవాళ నా జీవితంలో మహత్తరమైన స్వర్ణ దినం!' అన్నారామె, ముగింపు వాక్యంగా. కిందటివారం జరిగిన సావిత్రి సన్మానసభలో యివి విశేషాంశాలు.

నిజంగా ఆరోజు ఆమె జీవితంలో స్వర్ణ దినంగానే పేర్కొనవలసివుంటుంది. ఒక తెలుగుబిడ్డకు — ఒక చక్కని నటిగా, ఆదర్శగృహిణిగా, మాతృమూర్తిగా భాసిల్లుతున్న శ్రీమతి సావిత్రికి ఆనాడు జరిగిన సన్మానం చూసి ఏ తెలుగు హృదయమూ స్పందించకుండా వుండదు.

* * *

పి. ఏ. పి. అధినేత శ్రీ అనుమోలు వెంకటసుబ్బారావుగారికి యిటీవల కారు ప్రమాదంలో గాయాలు తగిలినవి. మధుర నుంచి కొత్తకారు డెలివరీ తీసుకొని వస్తూండగా మార్గమధ్యంలో లారీ వొకటి వారి కారును ఢీకొన్నప్పుడు యీ ప్రమాదం సంభవించింది నేను ఆయన్ని చూసేందుకు వెళ్లినప్పుడు 'నా అయామ్ ఆల్‌రైట్!' అన్నారు, తన సహజమయిన చిరునవ్వుతో. నుదురుమీద పట్టీ వేసివుంది. 'వేళావిశేషం మంచిది. లేకపోతే ప్రమాదభరితమైన పరిస్థితి ఏర్పడివుండేది' అన్నారాయన. శ్రీ సుబ్బారావు అదృష్టవంతుడే కాదు! తుఫానులో చిక్కుకున్నా చలించనంతటి ధీరోదాత్తత ఆయనలో వుంది.

* *

'సతీ అరుంధతి' చిత్రం షూటింగ్ పునఃప్రారంభమయింది ఇటీవల జమున ఒక వారంరోజులపాటు హైదరాబాద్‌లో ఆ చిత్రం షూటింగ్‌లో పాల్గొని యీనెల 13 వ మద్రాసుకు తిరిగి వచ్చింది. 'తల పోటుగా వుందండీ! మధ్యాహ్నం పడుకుందా




# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండె జలుబుకు, సాధారణ జలుబుకు అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పికి, తలనొప్పికి, బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

# చిత్రలహరి

మంచి నాటకాలూ, ప్రెసిడెంట్ గా అంటూ హైదరాబాద్ నుంచి ఎవరో వచ్చారు' అన్నది, ఓ సాయంకాలంపూట వాళ్లింటిముందు లాన్‌లో కూచున్నపుడు. ఆమె ప్రస్తుతం హాబిబుల్లా రోడ్‌లోని యింట్లో వుంటున్నది. వచ్చేనెలలో జమున తిరుమలపిళ్లె రోడ్‌లోగల తన స్వంత భవనంలోకి మారబోతున్నది!

* * *

కొత్తవాళ్లలో 'కృష్ణ' బాగా నిలదొక్కుకున్నాడు. నటనలో యువుడలను నిర్విరామంగా కృషి చేస్తున్నాడు. శౌమథ్య శ్రీ ప్రొడక్షన్స్ వారి 'మరపురాని కథ' రషెస్ చూశాను. అందులో కృష్ణ ఎంతో ప్రతిభావంతమైన నటన కనపరిచాడు. అతను చక్కని నటుడుగా రాణించేందుకు యీచిత్రం దోహదం చేస్తుంది. ఇపుడు కృష్ణ — ఉపాయంలో అపాయం, అసాధ్యుడు, లక్ష్మీ నివాసం, స్త్రీజన్మ, ప్రైవేటు మాస్టారు, అమాయకుడు, బి ఆర్. ఫిలిమ్స్, విలువపుదోపిడి, మధు పిక్చర్స్, విజేతా ప్రొడక్షన్స్, కల్పనచిత్ర, దేవర్ ఫిలిమ్స్,



సవుత్ ఇండియా ఫిలిమ్ ఛేంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షుడుగా ఎన్నిక అయిన శ్రీ సుందర్‌లాల్ నహతా ప్రఖ్యాత చలనచిత్ర నిర్మాత, పారిశ్రామికవేత్త.

వీ. వి ఆర్ పిక్చర్స్, ఆనేకళ్ళు లక్ష్మి రమణ ఫిలిమ్స్ చిత్రాలలో నటిస్తున్నాడు.

**'చికెన్ కూడా మంచి యిష్టం....'**

'నాకు చాముండీ అంటే ఎంతో యిష్టమండి!' అన్నది, రాజశ్రీ వాహినీలోని ఏ. సి. మేకప్‌రూమ్‌లో కూచుని తనకు యిష్టమైన ఆ పదార్థాన్ని తింటూ. 'చికెన్ కూడా మంచి యిష్టంగా తింటాను' అన్నదామె తిరిగి. 'ఏమిటి షూటింగ్?' అడిగాను. 'కాంభోజరాజు కథ షూటింగే కాని డైలాగ్స్ లేవు. సైలెంట్ షాట్స్. క్లోజప్స్ తీస్తున్నారు.' అంటూ ఆగి 'ఆ! అన్నట్లు చెప్పడం మరిచాను. మా అన్నయ్యకు ఆడ



'త్రిజన్మ'లో రామానాయుడు, అంజలీదేవి, కృష్ణకుమారి. ప్రకాశరెడ్డి.



'గొప్పవారి గోత్రాలు' లో
కొత్తనటి లక్ష్మి

పిల్ల పుట్టిందండీ!' అన్నది 'మీ అన్నయ్యకా, మీ వొదినకా?' అని అడిగాను. 'సిల్లీ!' అంటూ చిన్నబుచ్చుకుని, ఆవెంటనే ఫక్కున నవ్వేసింది రాజశ్రీ అప్పాట వైట్ బ్లౌజు వేసుకుని, దానిమీద లేత గులాబీ రంగు చీర కట్టుకున్నది. లేత గులాబీ రంగన్నా ఆమెకి మక్కువ.

**'గ్రీన్ అంటే అసలు ఇష్టం ఉండదు'**

రంగంటే జ్ఞాపకం వచ్చింది. సుకన్యకి తెలుపురంగంటే ఎక్కువ యిష్టం. అందుకే ఆమె తన యింట్లోని సోఫాగుడ్డలమంచి తను కట్టుకునే చీరదాకా అన్నీ తెలుపే వాడుతుంది సాధారణంగా. 'తెలుపు నాకు లైకింగే కాని, గ్రీన్ అంటే అసలు యిష్టం వుండదు. ఎందుకంటే, ఏమో చెప్పలేను!' అంటుంది సుకన్య ఇటీవల నేను వాళ్ళింటికి వెళ్ళినపుడు ఆమె డాన్స్ రిహార్సల్ చేస్తున్నది. 'మంచి కృషి చేస్తున్నారే?' అన్నాను. అందుకామె నవ్వి 'ఎంత కృషిచేసినా అదృష్టం వుండాలిగా!' అన్నది. 'అంటే మీకిపుడు అదృష్టం లేదనా?' 'నాకు లేదని కాదు. కృషికన్న అదృష్టమే ముఖ్యం అంటున్నాను సినిమాతారల భవిష్యత్తు మూడువంతులు అదృష్టంమీదనే ఆధారపడివుంటుంది. ఆ మిగిలిన వాళ్ళ సొంతూ టాలెంట్ ఆ టాలెంట్‌కి అదృష్టం జతపడితేనే కదా, గుర్తింపూ—రాణింపూ' అన్నది నవ్వుతూ. ప్రస్తుతం—శ్రీ కృష్ణావతారం, ముగ్గురు మరాఠీలు విశ్రాంతి 12 గంటలకు చిత్రాల్లో నటిస్తున్నది, సుకన్య

—మోహన్‌కుమార్ ●



'మరపురాని కథ'లో వాణిశ్రీ, సంధ్యారాణి, యస్. సాంబశివరావు

# నెమలిముక్కునుంచి రాలిన వజ్రం

బర్ద్వాన్ మహారాజా ఓసారి లండన్ వెళ్లాడు. ఆయన తనతోపాటు తీసికెళ్లిన పెట్టెబేడాతోబాటు ఓ సంచీ కూడా ఉంది. తనకు నిత్యావసరాలకు అప్పుడప్పుడు ఉపయోగించే సామగ్రి ఉందని మహారాజా చెప్పగా ఇండియాలోని కస్టమ్స్ అధికార్లు దాన్ని పరీక్షించకుండా వదిలివేశారు. లండన్ చేరిన తర్వాత మహారాజా ఆ సంచిలో ఉన్న వజ్రానొకదానిని ఓ వేలం సంస్థ ద్వారా రెండు లక్షల రూపాయలకు విక్రయించాడు. విలువైన ఆ వజ్రం నగల బజార్లో పెట్టగానే నగరంలో పెద్ద సంచలనం కలిగింది. లండన్ వార్తాపత్రికలలో ఆశ్చర్యాన్ని గొలిపే వార్త వెలువడింది.

'జహంగీర్ నెమలి కిరీటంలోని ఒక భాగం ఈ వజ్రం. బంగారంతో తయారై రత్నాలు పొదిగిన ఈ కిరీటం 1738వరకూ ఢిల్లీ చక్రవర్తులకి గర్వకారణంగా ఉండేది. అప్పుడు రాజుగా ఉన్న మహమ్మద్‌షాని పర్షియా నుంచి దండెత్తి వచ్చిన నాదిర్‌షా కొల్లగొట్టి ఆ కిరీటాన్ని తన దేశానికి తీసికెళ్లాడు. ఆ విధంగా ఆ నెమలి కిరీటం భారతదేశం నుంచి మాయం అయినా అందులో నెమలి ముక్కు నుంచి ఊడిపడిన ఒక వజ్రం మాత్రం ఇండియాలోనే ఉండిపోయింది. కాలక్రమేణా అది బర్ద్వాన్ రాజ వంశానికి సంక్రమించింది. చాలా మంది దాన్ని 'జహంగీర్ వజ్రం' అనేవారు. దాన్ని ప్రత్యేక సందర్భాల్లోనూ, ఉత్సవ సమయాల్లోనూ బర్ద్వాన్ మహారాజాలు తలపాగాలలో ధరిస్తూండేవారు.

'జహంగీర్ 1021—అక్బర్ కుమారుడు' అని పర్షియన్ భాషలో ఉన్న అక్షరాలు ఆ వజ్రం మీద చెక్కి ఉన్నాయి. హిజ్రీశకానికి సంబంధించిన ఈ 1021వ సంవత్సరం క్రీస్తు తర్వాత 1621కి సమానం.

లండన్ పత్రికలలో పడ్డ ఈ వార్తని చూసిన ఇండియన్ కస్టమ్స్ అధికారులు ఆందోళన చెందారు. మహారాజా చేసిన ఈ పని ఆయన తిరిగి రాగానే చిక్కుల్ని తెచ్చిపెట్టింది. ఎగుమతుల చట్టాన్ని అతిక్రమించి పురాతన విలువగల ఒక వస్తువుని దేశంనుంచి తీసికెళ్లినందుకు కలకత్తా కస్టమ్స్ అధికారులు ఆయనకి ఒక లక్ష రూపాయలు జరిమానా విధించారు. తరతరాలుగా తమ రాజవంశానికి సంక్రమిస్తున్న ఆస్తి అయిన ఆ వజ్రానికి పురాతన వస్తు విలువ ఉన్నదన్న విషయం తనకు తెలీదని మహారాజావారి వాదన.

—విను.

# పుస్తకాలు

## రదనిక

(నవల రచయిత: శ్రీ నటరాజ రామకృష్ణ ప్రచురణ: నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరురోడ్, విజయవాడ—2 పేజీలు: 139. వెల: రూ. 3—00.)

ఇతివృత్తం చారిత్రకం. రాజులూ, రాణులూ ప్రధాన పాత్రలుగాలేరు. కవీ, నర్తకీ ముఖ్యపాత్రలు. రాజూ, మంత్రీ మంచి మనుష్యులుకారు. కళపేరిట రాజ్యం పేరిట అధర్మాలుచేసే మహానుభావులు.

రదనిక నర్తకిఔ సుందర విషపుష్పం. ఆమె వళ్ళంతా విషం. విషనాగులతో సరస సల్లాపాలు సుధాలావంగా సాగించగలదు. నాగుబాములకంటే బాగా నృత్యం చేస్తుంది. సౌందర్యవతి. యువ్వన వతి. ప్రేమించినవాణ్ణి చెంతకు రానీక. ప్రేమించనివాణ్ణి చేరువకు రానిచ్చే సాధ్వి!

రదనిక పాత్ర ప్రశ్నలపుట్ట జీవితంలో ఎన్నో ప్రశ్నలు ఆమె కెదురవుతాయి ఆమె ఎందరికో ప్రశ్న అవుతుంది. పాఠకులకు ఆమెగూర్చి ఎన్నో ప్రశ్నలు ఎదురవుతాయి కథాంతంలో చాలా ప్రశ్నలకు సమాధానంవుంది ఒక్క ప్రశ్నకేలేదు. ఆ ప్రశ్న అయినా ఆమె అలా ఎలా కాగలిగింది?

రచయిత నవలలో ఉత్సుకత రేకెత్తించటానికి ఆమె పూర్వగాథ చెప్పలేదు. అలా చెప్పకుండా కథ నడిపించటం వాస్తవికతకు దగ్గరగావుంటే రచనలో, శిల్పదృష్టితో సుగుణం. కాని, శ్రీ కృష్ణ ప్రేమ అంత దూరం సాగేందాకా, తను అతన్ని అంతగా ప్రేమించిందాకా చెప్పకుండా వుండటం అసహజం. తను చెప్పకుండావుంటే ఒక నిండు ప్రాణి బలి అవుతుందని ఆమెకు తెలియకపోలేదు.

శ్రీకృష్ణ కవి. కవితా హృదయం ఉన్నవాడు ప్రేమించి బాధలు పడినవాడు. పర్యవసానం తదనుగుణంగా వుంటుంది. వద్దిరాజా ఆస్థానం నుంచి తొలిగింపబడి, చంద్రభానుదేవ సంస్థానంలో ప్రవేశించి, రదనిక హృదయం కొల్లగొన్నాడు. కవిగా ఉన్నత శిఖరాలు అధిరోహించాడు.

శ్రీ కృష్ణ రదనికల భావ తీక్ష్ణత ఉచిత రీతిలో సాగింది. భావ ప్రకంపనకు అనుగుణంగా కవితా పద్ధతిలోని రచన పాఠకులకు ఆనందం కలిగిస్తుంది. వారిద్దరి భావశబలత ప్రదర్శించే ఘట్టాలు రసవత్తరంగా హృదయాలు కవితానాట్యం చేసేలాగా వున్నాయి.

నర్తకి అయిన రదనిక పాడగలదు. కవిత్వం చెప్పగలదు. కవి అయిన శ్రీ కృష్ణ పాడగలడు. నృత్యం చేయగలడు. వారిద్దరి శృంగారాభాసం రసరమ్యంగా వుంది.

అనుకూలత ఎరూపని రదనికతో కవి సంభాషణ, వాక్యాలలో కఠినత్వం, పాత్రోచితం కాదని ఎవరయినా అనుకోవచ్చు. కాని ఆ పరిస్థితులలో ఆ వ్యక్తులు, అలాగే మాట్లాడటం సహజం.

మహారాజు చంద్రభానుదేవ పాత్ర చాలా చిత్రమయింది. అల్పకారణాలకు రాజు ఏడ్వటం పాఠకులు ఎక్కడా చూడరు. ఈ నవలలో చూడవచ్చు. రాజు ఎంతో దుర్మార్గుడు. అయినా సన్మార్గుడుగా కనబడుతాడు. రదనికకూ, రాజుకూ ఉన్న సంబంధం తెలిసింతర్వాత ఎలాంటి వాడయినా ఇలా ఎలా చేశాడా అనుకొంటారు పాఠకులు. అది అసహజమే!

మహామంత్రి తోలుబొమ్మలాట సందర్భంలో అవాంతరంగా ఆలోచించే తీరు నవలలో ప్రవేశపెట్టినందువల్ల సాధించిన ప్రయోజనం ఏమీలేదు

చంద్రభానుదేవ ప్రవర్తనా ఆలోచనా, మామూలు తీరగా రాజులకు తగినవిధంగాలేవు. డబ్బు సంపాదన మీద ఆసక్తి, తనతో అక్రమ సంబంధాలున్న స్త్రీలకు కొలువులో ఉద్యోగాలిచ్చి అడ్డం లేకుండా తొలిగించుకోవటం, పేరు ప్రఖ్యాతులకోసం ప్రాకులాడటం ప్రజల్లో మంచిపేరు రావాలని తిప్పలు పడటం, ఈ కాలం 'మినిష్టర్'లను తలపిస్తాయి.

రచయిత, కవిని మహాత్మ కవిత వ్రాయగల సమర్థుడుగా చిత్రించి, ఆ కవి వ్రాసిన గీతాలివి అని రచయిత వ్రాసిన పాటలుచూచి పాఠకులు ఇంత మాత్రం కవిత్వంచేత అంత పెద్ద భట్టారకుని ఓడించాడా కవి అనిపిస్తుంది. రచయిత తనపాటలు నవలలో చొప్పించకుండా కవి గొప్ప, కవిత్వం వ్రాశాడని తెలిపితే ఎంతమంచి కవిత్వం వ్రాశాడో అని ఆలోచించుకోవటంతో పాఠకులు పొందే ఆనందం, రచయిత వ్రాసిన పాటను చూచిం తర్వాత పోతుంది.

రైతులవద్దనుంచి రూప్యంలో ఆరోవంతు సాంస్కృతిక కార్యకలాపాలకు వసూలు చేసినమొత్తం పది లక్షల సువర్ణ నాణేలు' అయిందంటే ఆ రాజ్యంలోఉన్న జనాభా చూచి ఇంతమంది జనం ఈ రాజ్యంతో ఎలా ఉన్నారు అనుకొంటారు పాఠకులు.

అచ్చుతప్పులు ఎక్కువ. రచయితకు మంచి భాష తెలుసు అనుకొంటారు సామాన్యులు. కాని నవలలో ఎదురయ్యే భాషనుచూచి, ప్రాథమిక వ్యాకరణం రచయిత ఎందుకు పాటించలేదా అనిపిస్తుంది.

ఏది ఎలావున్నా, భాష, పాత్రచిత్రణ, కథాకథనం అన్నీ వదిలి, హృదయాలు కదిలించే విధంగా కవితాత్మకంగా ఉన్న ఈ నవల చదివి పాఠకులు స్వప్నలోకాలలో విహరించవచ్చు.

—మనోరాణి

## అమృతబిందువులు

భావఖండికలు. శ్రీ బచ్చు వెంకటేశ్వరగుప్త రచన. అన్ని రంగాల్లోను కవితా దృష్టితోసంచరించి అమృత బిందువుల్ని కూర్చిన పుస్తకం ఇది. చక్కని రచన. 133 పేజీల పుస్తకం వెల మూడున్నర. ప్రతులకు: శ్రీరామ కళాక్షేత్రము శ్రీరామ మందిరము, సదాశివపేట.

## వెలుగుపూలు

గేయాలు. రచయిత సమతారావు. చిన్నపిల్లలు 'వెలుగు పూలను' చేతబుచ్చుకుంటే నలిగిపోయినా విడిచి పెట్టరు. సరళమైన భాష, భావసంపదా ఇందులో వుంది. 35 పేజీల పుస్తకం వెల 50 పైసలు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

—సీతరాజు

# ధర్మపథం

(16 వ పేజీ తరువాయి)

నీరు త్రాగవద్దులే! నీకు అమృతాన్నివ్వాలని యింద్రునికి ఆజ్ఞ యిస్తాను' అంటూ ఆ రీతినే ఆజ్ఞ యిచ్చాడు.

ఇంద్రుడు 'ఈ దురహంకారికి అమృతం యిమ్మంటావా ? నీ ఆజ్ఞ దాటరానిది; కాబట్టి యిస్తాను. కాని నా రూపంతో కాకుండా, హేయమైన రూపంతోనే యిస్తాను. దీనికి సమ్మతించాలి' అని చెప్పగా, శ్రీకృష్ణుడు దానికి సమ్మతించాడు.

అయితేనేం? ఉదంకుడు ఆ అమృతాన్ని కూడా తిరస్కరించాడు...'ప్రాణాలు పోయినా సరే; ఈ నీచుడి అమృతాన్ని తాగను' అన్నాడు. ఇంద్రుడు వెనక్కి వెళ్ళిపోయాడు.

ఉదంకుడు ఎంతో బాధపడుతున్నాడు. శ్రీకృష్ణుడు అతని అవస్థను చూడలేకపోయాడు. మారాముచేసిన బిడ్డకు తల్లి లొంగిపోయినట్లు లొంగిపోయి 'నాయనా! నీ బాధ పోతుందిలే! నువ్వు కోరినప్పుడు ఉదంకాలనే మేఘాలు మరు భూమిలో వర్షించి నీ తృష్ణను తీరుస్తాయి' అని వరం యిచ్చాడు.

భగవంతుడి వాత్సల్యం అట్టిది! ●

# మస్నవీ

(20 వ పేజీ తరువాయి)

ఈవిధంగా అవి మనకి మిగిలిపోయాయి.

రుమీ కీర్తి, పలుకుబడి మరింత పెరిగి పెద్ద పెద్ద పదవులలోవారు కూడా అతనిచుట్టూ చేరటం మొదలుపెట్టారు. ఇతని కీర్తి ఎంతదాకా పాకిందంటే 1273 లో మొగల్ సేనలు మళ్ళీ పర్షియామీద దండెత్తినప్పుడు వారు కోనియా కోటని పడగొట్టినా రుమీమీద గౌరవంతో ప్రజలకి ఏహానీ రానివ్వలేదు.

జలాల్—అల్‌దీన్ గ్రంథాలలో కెల్లా ప్రసిద్ధమయినది 'మస్నవీ.' ఇదొక పద్య గ్రంథం. ఇందులో ఎన్నో దివ్యసందేశాలు కనిపిస్తాయి.

'సూఫీ' అంటే ఏమిటి? సూఫీ అంటే నిరాడంబరంగా సన్యాసం పుచ్చుకున్న వారి లాగా జీవించే వ్యక్తి ఎవరయినా సరే—స్త్రీ పురుష భేదంలేదు. సూఫీ మత ముఖ్య సిద్ధాంతం— 'దేవుడే సత్యం. అతనికి పేరు లేదు. అతని స్వభావం ఇటువంటిదని చెప్ప లేము. దేవుడిలో మంచికి తప్ప చెడ్డకి తావులేదు అందుచేతనే సంపూర్ణ సౌందర్యం కలవాడు.'

మహమ్మదీయులలో కొరాన్ పవిత్ర గ్రంథం తర్వాత మస్నవీకే అధిక గౌరవం ఉంది.

సుప్రసిద్ధ భక్తుడు స్వామి రామతీర్థ కూడా మస్నవీ చదివి ముగ్ధుడయి వేదాంతం, సూఫీ రెండూ ఒకే సందేశం చాటుతున్నాయని అన్నాడు.

—ఎస్. ●

# మెదడుకి మేత

(23 వ పేజీ తరువాయి)

అంటే $21\frac{1}{4}$ రెట్లకన్న వేగం మరికొంచెం హెచ్చుగానే ఉండాలి.

కనుక, కుందేలు తాను మొదట ప్రయాణంచేసిన వేగం కన్న 20 రెట్ల వేగంలో మాత్రమే పరుగిడితే పందెం ఓడిపోతుంది.

* * *

(చ) మొత్తం 31 త్రిభుజాలున్నాయి.

* * *

(ట) రెండు అంకెలతో వ్రాయదగ్గ కనిష్ఠ పరిపూర్ణ సంఖ్య ఒకటి. ఎల్లాగంటారా!

$$\frac{1}{1}=\frac{2}{2}=\frac{3}{3}=\ldots\ldots=\frac{9}{9}=1$$

(త) $1^{0}=2^{0}=3^{0}=4^{0}=\ldots\ldots=9^{0}=1$

(ప) $\frac{148}{296}\times\frac{35}{70}=1$

బీజగణితం తెలిసినవారు ఇంకోలా కూడా వ్రాయగలరు.

$$(123456789)^{0}=1$$

లేక $(2345670)^{9-8-1}=1$

ఇల్లాగ ఇంకా అనేక విధాలుగా వ్రాయవచ్చు.

(గ) $9\frac{99}{99}=10$

లేక, $\frac{99}{9}-\frac{9}{9}=10$

లేక, $(9\frac{9}{9})^{\frac{9}{9}}=10$

లేక, $9+9\,9^{9-9}=10$ ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# తలనొప్పా?

# సారిడన్ 'రోష్' వేసుకోండి

## నొప్పి మటుమాయమై...



## ... మీకు నవోత్సాహము కలుగుతుంది!

**అదే సారిడన్ యొక్క ప్రత్యేకత!** నొప్పిని, దాని వలన కలిగే శ్రమను పోగొట్టుటయేగాక, హాయి నవోత్సాహములనుకూడ కలిగించుటకై సారిడన్ ఒక ప్రత్యేక సూత్రముతో తయారు చేయబడినది. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! నొప్పి, శ్రమ మటుమాయమై, సరిగ్గా ఆలోచించ కలుగుతారు ... పని యందు ఆసక్తి కలుగుతుంది ... స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు ... ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును. ఎల్లప్పుడు సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి. పిల్లలకు ¼ నుంచి ½ బిళ్ల వరకు మాత్రమే చాలును.




తలనొప్పి
పంటినొప్పి
ఒంటినొప్పి
బహిష్టునొప్పి

ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమవుతాయి!

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

VT. 5626 (A)